రచయిత :
**డా॥ కడిమిళ్ళ వరప్రసాద ద్విశతావధాని**
M.A.Phd.
టేలర్ హైస్కూల్
నరసాపురం - 534 275
☎ 4876

ప్రతులు - 1000
తేది : 12-9-1997

ముద్రణ :
భవానీ స్క్రీన్స్
పాలకొల్లు - 534 260
☎ 23262

ముఖచిత్రం :
భవాని గ్రాఫిక్స్
☎ 23262, 22525

వెల - రూ॥ 20/-

ప్రతులకు :
**చక్రావధానుల రెడ్డప్పధవేజి**
రాయపేట
నరసాపురం - 534 275
☎ 699

# కృతి భర్త



డా॥ B.S.N. మూర్తి, శ్రీమతి లక్ష్మీనరసమ్మ

# ఇంతింతై వటుడింతయై

ఆజానుబాహు విగ్రహం, పండువెన్నెలలాంటి జుట్టు, ఖద్దరు పంచె, లాల్చీ చేతిలో గొడుగు, కాలినడక. పదహారణాల తెలుగుతనం. కాని నోరు విప్పితే ధారాళమైన ఇంగ్లీషు గొంతులో గాంభీర్యం వాగ్విన్యాసంలో కొట్టవచ్చినట్టు కనిపించే పెద్దమనిషి తరహా నిరాడంబరం, సూటి మాటకారితనం, ఎంతటి వాడినీ లెక్కచేయని ధోరణి, ఎంత సామాన్యుడినయినా గౌరవించే వినయం ఇలా పరస్పర విరుద్ధ గుణాలు కలబోసినట్టు కనిపించే ఈయనను చూడగానే ప్రతిఒక్కరు భక్తిగా నమస్కరిస్తున్నారు. ఇంతకూ ఎవరాయన"? అని

ఆయన పేరు B.S.N. మూర్తి. స్వాంతంత్ర్య సమరయోధుడు, ప॥గో॥జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం అధ్యక్షుడు, సీనియర్ జర్నలిస్టు పేద కుటుంబంలో పుట్టి, పసితనంలోనే తల్లిని కోల్పోయి, అమ్మమ్మ పెంపకంలో పెరిగి, చదువుకొనేందుకు డబ్బులేక, 8వ తరగతి వరకు మాత్రం చదివి, ఉపాధ్యాయ వృత్తిని చేపట్టి, విద్యా తృష్ణ ఆగక ఉద్యోగానికి స్వస్తి పలికి, పట్టుదలతో, కొందరు పెద్దల సహకారం కొంత, స్వయం కృషి కొండంతగా మళ్ళీ చదువు ప్రారంభించి, ఇంతింతై ఎదుగుతూ చివరకు లండన్ వెళ్లి, 'లండన్ విశ్వ విద్యాలయం' లో అంతర్జాతీయ వ్యవహారాల విషయంపై పరిశోధన చేసి, డాక్టరేట్ పట్టా పొందిన విద్యా కృషీ వలుడు.

ప్రారంభంలో ఉపాధ్యాయ వృత్తి, పై చదువులలో విద్యార్థి సంఘ అధ్యక్షపదవి తరువాత డిఫెన్స్ అకౌంట్స్ అఫీసులో గుమాస్తాగిరి, జనవాణి పత్రికలో సబ్ ఎడిటర్, హైదరాబాద్ జర్నలిస్టుల సంఘానికి సంయుక్త కార్యదర్శి, కేంద్ర శాసనసభ కాంగ్రెస్ పార్టీ సహాయ కార్యదర్శి, లండన్‌లో కాంగ్రెస్ ఆఫ్ పీపుల్స్ ఎగినెస్ట్ ఇంపీరియలిజంకు ప్రతినిధి, అక్కడ "స్వతంత్ర' ' "ఇండియన్ రిపబ్లిక్" పత్రికల విలేఖరి, గ్రేట్ బ్రిటన్ ఐర్లండ్‌లోని పత్రికా విలేఖరుల సంఘంలో సభ్యుడు, ఢిల్లీలో పార్లమెంట్ రిసెర్చ్ బ్యూరో సంయుక్త కార్యదర్శి, కేంద్రప్రభుత్వం నియమించిన "భారతదేశంలో స్వాతంత్ర్య సమరయోధుల చరిత్ర" గ్రంథ సంపాదక సంఘంలో సీనియర్ రిసెర్చ్ ఆఫీసర్,

ఇండియా ఆఫ్రికా కౌన్సిల్ కార్యదర్శి,, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ యూత్ ప్రతినిధి, వియత్నాంలో శాంతి పరిరక్షణకు ఏర్పాటు చేయబడిన అంతర్జాతీయ కమిషన్‌లో పబ్లిక్ రెలేషన్స్ ఆఫీసర్, మరియు డెప్యూటీ సెక్రటరీ జనరల్, సోవియట్ అకాడమీ ఆఫ్ సైన్స్ అతిథి. పోలిష్ ప్రభుత్వ అతిథి, కేంద్ర ప్రభుత్వ పర్యటన శాఖ డైరెక్టర్, టూరిజంపై ఇకాఫే నిర్వహించిన సెమినార్‌కి ఐక్యరాజ్యసమితి కార్యదర్శి, రోడ్ ట్రాన్స్‌పోర్టుపై జరిగిన ఇకాఫే సెమినార్ ప్రతినిధి, కేంద్రప్రభుత్వ వినోద పర్యాటక శాఖ డైరెక్టర్, పాట్నా మహాసభల భారత ప్రతినిధి, I.L.O మహాసభకు భారత ప్రభుత్వ పరిశీలకుడు, ఆసియా ఆఫ్రికా న్యాయ ఆలోచన సలహా కమిటీ సమావేశానికి సలహాదారు, కమర్షియల్ ఆర్బిట్రేషన్ పై జరిగిన అంతర్జాతీయ సెమినారుకు భారత ప్రతినిధి, ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా సెక్రటరీ జనరల్, ఇండియన్ సొసైటీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా పత్రిక సంపాదకుడు, ఇండియన్ అకాడమీ ఆఫ్ ఇంటర్నేషనల్ లా అండ్ డిప్లమసీ డైరక్టర్ సింగపూర్‌లో జరిగిన పాటా రిసెర్చి సెమినార్ భారత ప్రతినిధి, జపాన్ దేశంలో ఉన్న విదేశ ప్రభుత్వ టూరిస్ట్ సంస్థల ఛైర్మన్. ఇవి ఆయన చేసిన ఉద్యోగాలు, పదవులు

లండన్, వియత్నాం, రష్యా, చైనా, పోలెండ్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఫీజి, జపాన్, సింగపూర్ ఇవి విద్యా , పదవీ, ఉద్యోగాల నిమిత్తం ఆయన పర్యటించిన, గడిపిన ప్రదేశాలు

ఇక రచయితగా తెలుగులో మూడు ఏకాంకికలు నా అనుభవాలు జ్ఞాపకాలు, Nehru's Foreign palace, Indias Stand on Coria, India in the Common Wealth, Viyatnam Devided on Finished Struggle, Viyatnam the Cycle of Piece. అనే గ్రంథాలు వారి రచనలు. స్వాతంత్ర్య సమరంలో పాల్గొని చాలకాలం జైలులో మ్రగ్గుట వారి దేశభక్తి, జవహర్‌లాల్ నెహ్రూ, నీలం సంజీవరెడ్డి, కామరాజు నాడార్, భోగరాజు పట్టాభి సీతారామయ్య జాకీరు హుస్సేన్, N.G. రంగా, వావిలాల గోపాలకృష్ణయ్య మొ॥ వారు సన్నిహితులు, స్నేహితులు కావడం వారి స్థాయి, పేద విద్యార్థులకోసం లక్షరూపాయిలతో ఒక ట్రస్ట్‌ను ఏర్పరచుట వారి దానశీలం, లక్ష ఇస్తున్నా తాటికాయంత అక్షరాలతో తనపేరు చూసుకోవాలనే కోరిక

లేకుండా తల్లిలా సాకిన అమ్మమ్మ మంచెర్ల దుర్గమ్మ గారిపేరు పెట్టుట ఆయన కృతజ్ఞత. ఇంతగొప్ప వాడయ్యుండీ సామాన్య మానవుడిలా రహదారిపై నడచివెళ్లుట, సభలు, సమావేశాలలో సగటు ప్రేక్షకునిలా కూర్చుండుట, అందరినీ ప్రేమగా పలకరించుట వారికి గల ఔన్నత్యం.

అంతటి మహామహుడు శ్రీ B.S.N. మూర్తి అని తెలియగానే వారిపై నాకు ఎనలేని గౌరవం ఏర్పడింది. ఆయన కూడ నన్ను ఎంతో ఆదరంగా చూస్తూ, ఖాళీగా కాలయాపన చేయడం ఇష్టంలేక చాలకాలం నడిపిన ఊరు-వాడ పత్రికలో ఎన్నో వ్యాసాలు, కవితలు అడిగి మరీ వ్రాయిం చుకొని ప్రచురించారు. అందులో కొన్ని నా 'మనజాతి' ఖండకావ్యంలో చేర్చడం జరిగింది. కొంతకాలం ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలకు స్థానిక విలేకరి గాను కొంతకాలం ప్రెస్‌క్లబ్ అధ్యక్షునిగాను పనిచేశారు. ఇక వారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీనరసమ్మతో గాఢమైన అనుబంధం "అద్వైత్వం సుఖదుఃఖయోః" అన్న భవభూతి వాక్యానికి అసలు సిసలు ఉదాహరణముగా కనిపిస్తుంది. అంతటి మహావ్యక్తి సహస్ర చంద్రదర్శన సందర్భంగా నాకృతికన్య 'అమృత వర్షిణి'ని వరించి, స్వీకరించి, ఆదరించుట నాకు కాస్త ఇంచుమించులో జనక మహారాజు స్థాయిని కూర్చిపెట్టుట.

ఒక్కమాటలో నేను అదృష్టవంతుడిని ప్రత్యుపకృతిగా నేను ఇవ్వగలిగింది లేదు కావ్యం తప్ప. చేయగలిగింది లేదు కృతజ్ఞతా ప్రకటనం తప్ప.

డా॥ కటిమిళ్ళ



# అంకితం

1. ఆజానుబాహుల్వై యగుపట్టునే గాని
వినయాన్వితుండు వామనుఁడతండు
చుఱుకు పల్కులయందుఁ గఱుకు తోఁచును గాని
మృదు గుణాంచిత రసహృదయుఁడతఁడు.
తనయున్కి తనదిగాఁ గనుపట్టునే గాని
స్వాతంత్ర్యసమర బీభత్సుఁడతఁడు
ఆంగ్లభాషా వార్ధినాటలాడెనె కాని
ఆంధ్రత్వమునకుదాహరణమతఁడు
చదువులుద్యోగములు విదేశములయందు
జరిగెనే గాని, చివరకు జన్మభూమి
స్థిరనివాసముగాఁదాను జేసికొనియె
నతఁడు భాస్కర్ల సూర్యనారాయణుండు

2. ఆయన విగ్రహమ్ము పొడవైనది విద్యమరింత యున్నతం
బైయలరారె, జీవిక హిమాచల శృంగవిహార శీలయై
శ్రేయము నంటెఁ బ్రేమగ వరించిన కీర్తిలతాంగి సూర్యనా
రాయణమూర్తికందక దిగంతములందుఁ జరించుఁజిత్రమై

3. ఆయన బాల్యమెల్లనది యర్థవిహీనముగాని, యెవ్వరో
సాయమ చేయగాఁ జదువు సంటెల నేరిచి, యర్థవంతుఁడై
న్యాయ తపస్వియై, వితరణాంచితుఁడై విలసిల్లు సూర్యనా
రాయణ మూర్తికింగల కరమ్ములకెమ్ములు లేవు చిత్రమే

4. మూడునెలలకే తల్లిఁగోల్పోయినాఁడు
పదనొకొండవ తరగతి పట్టువేళ
తండ్రియు గతించెనమ్మమ్మతల్లి యగుచు
కూలియో నాలియో చేసికొనుచు సాకె.

5. ఆకృతజ్ఞత యెదయెల్లనలముకొనుట
నామెపేరిట లక్షరూప్యముల నొసఁగి
పేద విద్యార్థులకుఁగల్ప వృక్షమయ్యె
ధాత్రి మంచెర్ల దుర్గమ్మ ధన్యయయ్యె

6. ఒక్క పేదవానికున్నతోన్నత విద్య
పట్టువడియెనెంత పట్టుదలయొ
ఒక్క పేదవానికున్నతోద్యోగమ్మ
పట్టువడియెనెంత దిట్టతనమొ

7. స్వాతంత్ర్యోద్యమ యోధుఁడా ఘనుఁడు శిక్షల్ పుష్పహారమ్ములై
ఖ్యాతిందెచ్చు సమస్త సత్కృతులు కారాగార వాసమ్ములే
చేత : ప్రీతికరమ్ములింద్ర గృహముల్, చిప్పల్ మహాపాత్రముల్
రోతన్ బెంచెడి కూడు పాయసము, పొర్లున్ నేల పూసెజ్జయున్

8. భరతమాతకనుంగు పట్టియై వెలుగొందు
జవహరుడతగాని సన్నిహితుఁడు
భరతాంబకే ప్రేమఫలమైన యొకబిడ్డ
జాకీరు హూస్సేను సరసహితుఁడు
ఆంధ్రుఁడై భరతాంబకాది పౌరుండైన
సంజీవరెడ్డి నేస్తమ్ము తనకు
కాంగ్రెస్సునకు నాయకత్వమ్ముఁదాల్చిన
కామరాజే జతగాఁడు తనకు
ముఖ్యహితుఁడయ్యె పట్టాభి భోగరాజు
గాఢహితుఁడయ్యె ఎన్. జి. రంగా యొకండు
జాతిరత్నమ్ములే సహచరులు తనకు
కాని గర్వమ్ము సున్న భాస్కర్లయందు

9. అట్టి యోగ్యుడే నాకల్లుఁడయ్యేనేని
నింతకంటెను భాగ్యమింకేమి కలదు ?
ఎనుబదేండ్ల వాఁడనుచు నాకేలచింత
'అమృతవర్షిణి' నాకూతురగుటఁ జేసి.

10. అట్టి భాస్కర్ల సూర్యనారాయణునకు
అంకితమ్ముగ నే బలుకాడుచున్న
'అమృత వర్షిణి' యనెడి కావ్యమ్మునకును
నెట్టి యారంభమనిన వీక్షింపుడయ్య



# గుండె సందడి



మహాకవి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్ర పురాణము చదివి, అందులోని కొన్ని కథలకు గుండె సందడించి వ్రాసిన ఖండికలు కొన్ని ఇందులో ఉన్నాయి. అందుచేత శాస్త్రిగారి పదబంధాలలో భావ విశేషాలలో కొన్ని యాదృచ్ఛికంగాను ఉద్దేశ్యపూర్వకముగాను కూడ వీటిలోకి దిగుమతి అయ్యాయి . ఔరసులకు ఆస్తి హక్కు తప్పదు గదా! ఇంక 'జనని' నా గుండెలో నిండిన భక్తి 'ఉప్పగోదారి' నాకు అన్నం పెట్టిన ఊరిపై గల కృతజ్ఞత. మిగిలినవి అయ్యాయి సందర్భాలలో నాకు కలిగిన భావావేశానికి ప్రతిరూపాలు. వీటిలో కొన్ని పత్రికలలో ప్రచురితమయ్యాయి. మరికొన్ని ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. అవీ, ఇవీ ఏర్చి, కూర్చిన 'ఖండకావ్యం' ఇది.

ఈకావ్యం ఈ రూపాన్ని ధరించడంలో గల భారాన్ని ఆర్థికముగానో, హార్దికముగానో వహించిన పెద్దలు, ఆప్తులు

సర్వశ్రీ **B.S.N. మూర్తి**<br>
**అత్తిలి గోపాల కృష్ణమాచార్యులు**<br>
**గోటేటి రాధాకృష్ణ**<br>
**కనికొండల రామచంద్ర రావు**<br>
**తమ్మిసెట్టి హరనాథ్**<br>
**శృంగారకవి రాధాకృష్ణ**<br>
**మంకు శ్రీను**<br>
**భవాని ప్రింటర్స్**

**వీరందరికీ మనసా,వాచా, కర్మణా ధన్యవాదాలు**

ఇంతకాలంగా నా ప్రతి కావ్యానికి లోకసాధారణంగా పెద్దల అభిప్రాయాలను జోడిస్తూ వచ్చాను. కాని, ఇప్పుడు, నేరుగా కృతిని అందిస్తున్నాను. మంచి - చెడులను పాఠకులే గ్రహించుకొందురు గాక.

డా॥ కటిమిళ్ళ

# అనుష్ఠానం

1. శ్రీ కంజాయత నేత్ర నాభి జలజాసీనాస్య పద్మమ్మునం
దేకంజానన నిల్చునో! యమృత సాహిత్యమ్ము వర్షించునో!
యాకల్యాణ గుణాలయా చరణ యుగ్మాంభోజ సంచార లీ
లాకుంఠ స్వన మాధురీ కలిత చేతోలీ! సుఖంబుండుమా!

2. అమ్మపలుకులే యొౌదల యందుదాల్చి
గరళ కంఠునకుత్తమాంగమ్మొసంగి
యమృత వర్షిణి కృప వారణాస్యుఁడైన
మాతృదేవుఁడు సర్వసంపదలనొసఁగు

3. అమృత రస వర్షి చంద్ర కళాభరణము
కాన్క తనకొటఁదనియు గంగా సుగాత్రి
కంతి పురముగఁ దన ప్రధానాంగమొసఁగు
కృత్తి వాసుఁడు సతము రక్షించుఁగాత!!

4. నేనెందేని శతావధానముల నెంతే గొంత శాస్త్రార్థ వి
జ్ఞానమ్మున్ బ్రకటింపఁ బండితులు మెచ్చున్ వచ్చునాడున్, గర
ధ్వానమ్ముల్ సభమారు మ్రోగునపుడున్ దథ్యమ్ము శ్రీ పాదల
క్ష్మీనారాయణ శాస్త్రి భిక్షయని లోఁజింతింతు నెల్లప్పుడున్.

5. నీ నాల్కంగల పాణినీయమది మున్నీరేమొ! - మచ్ఛ్రోత్ర కూ
పానం జిందిన కొన్ని బిందువుల జీవచ్ఛక్తి సాహిత్య భూ
మీనైదాఘము గొంత బాపినది స్వామి! నమ్ము శ్రీపాదల
క్ష్మీనారాయణ శాస్త్రి వర్య! భవదంఘ్రి ద్వంద్వమున్ మ్రొక్కెదన్!!

6. ఏ యెడనేనినే విషయమేని విమర్శనసేసి పల్కనౌ
రా ! యిది గొప్ప వక్తృతగదా ! యని పారిషదుల్ ప్రశంసలన్
జే యఁగ, శాస్త్ర కావ్యరససేవన శౌండుడు, రామ సూర్యనా
రాయణ యంత వాఁడు గురుఁడౌటకు సాక్ష్యముగాఁ దలంచెదన్.

7. పలికిన దెల్లఁ బద్యమగు పట్టునఁ బల్కగ వచ్చుఁగాని యా
పలుకులు కైతలై నిలుచుఁ బట్టు లెఱుంగని వాఁడు సత్కవీ
శుల దరి నిల్వఁ జాలఁడను సూనృత వాక్యమెఱుంగ, సోమయా
జులు గద మార్గ దర్శకుఁడు సూరి వరిష్ఠుఁడు దేశికార్యుఁడున్.

8. ఆటల్ పాటలతోడ జీవితమునే వ్యర్థమ్ముగాఁ జేయునా
తాటన్ దీయుచుఁబట్టి పద్దెముల పొంతల్చూపి, యిచ్చోటనే
యాటే యాడెదొ ! పాట పాడుకొనెదో ! యంచున్ నిబంధించెనా
కోటారాయ పదార విందములకున్ గూర్తున్ శిరః పీఠమున్.

9. నను నేనొక్క లతాంతం
బనుకొందును, నిన్ను దైవమనుకొందును, దీ
నినిఁ జేర్చుకొనఁ గదే గై
కొని, నీ పాదాల చెంత కోటారాయా! ॥

10. ఎవరే ప్రశ్నమునెప్పుడేనియునునెందేఁజేసినన్ వెంబడిన్
సవిమర్శమ్ముగ దానిసంగతులు విస్తారమ్ముగా జెప్పు వాఁ
డెవఁడుండున్ బరమ ప్రమాణముగ రూపింపన్ సమర్థుండు గౌ
రవ సంపన్నుఁడు నిమ్మగడ్డకుల సుబ్రహ్మణ్యుఁడే గణ్యుఁడౌ

11. సంస్కృతాన్నమునకు సంస్కృతి ఘృతమును
గలిపి ముద్దసేసి గారవమున
గోరు ముద్దతీపి కొసరి కొసరి తల్లి
యారగింపఁజేసె అన్నపూర్ణ.

12. ఏ విజ్ఞానమునందు నిత్యమమృతంబేత్రైనదో! - యా పయిన్
బ్రావృడ్గాతమియైనదో! పిదప సంద్రంబైనదో! దానినే
రావూర్యన్వయ వేంకటేశ పదమే ప్రార్థించి, సత్కావ్యభా
షావారాంనిధి ద్రచ్చివైచెద సుధాసారమ్ముమార్జించెదన్

13. మా'రావూరి' మహాగురుండనఁగ రామబ్రహ్మమే సాక్షి, వి
ద్యారాకేందుఁడు పల్కు వెన్నెలల పోతల్పోసి, శిష్యోన్నతిన్
స్వారాజ్యమ్ముగ నెంచి, యూర్ధ్వగతినే సాధించుకొన్నట్టి ధీ
సారుండా యమృతాంతరంగుఁడు మనస్సామ్రాజ్య నిర్ణేతయున్.

14. ఔరా వాని యుపన్యసించు విధమో ! ఆ పద్య నిర్మాణమో !
సారా సార వివేచనా పటిమయో ! సంచాలనౌన్నత్యమో !
పారావార గభీర కావ్యరచనా పాండిత్యమో ! శాస్త్రసం
భారమ్మో ! గణనీయుఁ డగ్రజుఁడు రామబ్రహ్మమెల్లప్పుడున్

15. నీకుం గల్గిన సాహితీ పటిమగానీ; సర్వశాస్త్రార్థవి
ద్యాకంజాత మరంద పాన జనితాయాసంబుగానీ, యహో!
మాకెట్లబ్బుఁద్వదీయ శిష్యులముగా మాకబ్బు గర్వోన్నతుల్
నీకెట్లబ్బుఁ దపస్సు చేసినను గానీ! కృష్ణమాచార్యుఁడా!

16. కవితా శారద నీదు నాల్కపయిఁ జొక్కన్ గాపురంబుండె, శా
స్త్రవచో లక్ష్మికి నీయెడంద గృహమై రాజిల్లె శిష్యార్థ గౌ
రవ గౌరీయుతమయ్యె నీతనువు, మర్యాదా త్రిమూర్త్యాత్మకా !
యవలంబించితి నేనుపాసనము దేవా ! కృష్ణమాచార్యుఁడా !

17. మొదటి యవకాశమొసఁగిన పుణ్యమూర్తి
శతవధానిగా నాకు యశమ్ము గూర్చె
భారతీ తీర్థుఁడా పద పద్మ రజము
నౌదలను దాల్చి ధన్యుండనగుదునేను.

18. భారతీ దేవి యొసఁగిన పాలలోని
శక్తి, వేంకట రామయ్య శాస్త్రి ప్రేమ
స్థితినిఁ గల్పించె వారికి సుతుఁడనగుట
నేను జేసికొన్నట్టి పున్నెముల పంట

19. జడమతులు గారు శ్రుతులం
దుడుపతులే, యెదిరి నిల్చునగ్రుని తలపై
తడబడక నిలుచువారే
కడిమిళ్ళాన్వయమునందుఁ గవినొక్కఁడనే ॥

20. శతఘంట కననమ్ము సలుపు సంగతియందు
సరిలేనియట్టి మిాసమ్ము ఘనము
అష్టావధాన కష్టావలంబనమందు
అమితమ్మైనట్టి కుంకుమము ఘనము
ఆశుధారా కవిత్వాడంబరమునందు
మహితమ్మైనట్టి వామనము ఘనము
సత్కావ్య నిర్మాణ చాక చక్యమునందు
సత్యనారాయణ శాస్త్రము ఘనము
అట్టి చెలువునకొక్కమారంజలించి
సరస కవితావధాన సాగర సహస్ర
తరణమెవరేనిఁ జేయఁ జిత్రమ్ముగాదు
చెలువుగాదది జగతికచ్చెరువు గాని.

# జనని

1. అమ్మకునమ్మయై జననమందినయప్పుడు దక్కనా ఋణం
బెమ్మెయిఁదీరునా యెడఁద యెంతటి బాడబమున్ భరించి, ర
త్నమ్ములొసంగునో సతము దైవతమున్ బడి మ్రొక్కనేల? శ్రే
యమ్మునొసంగఁగా మనకునమ్మను మించిన దైవమున్నదే?

2. అమ్మకుఁ గల్గుఁ దాల్మి గుణమందు వసుంధర యీడుగాదు కం
పమ్ములు వొందుచున్ బ్రదుకు బ్రద్దలు సేసెడి నైజముంటనా
యమ్మ యుదారతాగుణమునందున మేఘుఁడు సాటియా? నిదా
ఘమ్ముల యందు మచ్చునకుఁ గన్పడఁడెందున డాగి యుండునో !

3. అమ్మ గభీరతా గుణమునందు శతాంశము గల్గునా సము
ద్రమ్మనకుప్పెనల్ గలిగి, ధాత్రి సమస్తము ముంచి వైచి, భూ
తమ్ముల మ్రింగి, యాకలియు,దప్పియుఁ దీర్చు కొనంగఁజూచు. శాం
తమ్మునకిక్కయై మసలుఁ దల్లికిఁ గల్గునె యిట్టి చైదముల్?

4. అమ్మశుచిత్వమగ్నికి రవంతయు గల్గునె? ముట్టుకొన్న భ
స్మమ్మొనరించు; శాంత గుణ సంపదకుం గనియై శరీర జా
తమ్ములు కశ్మలమ్ములను దల్లి స్వయమ్ముగ నూడ్చి వైచుఁ; గ
ష్టమ్మను గల్గనీదు; తన సంతతికట్టివి తద్విశుద్ధతల్

5. వాయువు ప్రాణముల్ నిలువఁ బట్టునటంచు వచింత్రు గాని, పా
పాయికి జన్మనిచ్చి యల బ్రహ్మకు సాటిగ నిల్చునమ్మ యా
ప్యాయత ముందదెంత? యిఁక, నాకసమెంతటి శబ్దమూలమ
మ్మా ! యను మాట యమ్మయ గదా, మును ముందుగ నేర్పునోర్పుమై

6. ధనమో, విద్యయొ, రూప యౌవనములో తన్వీ మనః పీఠముం
దున వర్తిల్లి, తళుక్కుమన్నపుడె యేధో వింత ప్రేమామృతం
బును బంచన్ బతిఁ జుట్టి పట్టు కొనుఁ జేపుంబాలనా బిడ్డకై
ధనమా, విద్యయ, రూప యౌవనములా, తత్ప్రేమకుం బాత్రముల్ ?

7, నవ మాసమ్ములు గర్భ కోశముననానందమ్ముగా మోసి, గౌ
రవమున్ గాంచును బిడ్డ తల్లియగు వేళన్ బచ్చి మై దీఁగ యే
మవునో యన్న భయంబు లేదహరహంబా పిల్ల మైఁదీగ చే
రువ లోకత్రితయాధిపత్యమును నీరూపమ్ము గావించెడిన్

8. తన చీర మాసి యున్నను
దన ముద్దుల పట్టి బట్ట తళతళలాడున్
దన కడుపు నిండకున్నను
దన పట్టికిఁ బొట్ట పట్టు తప్పఁగఁ బెట్టున్

9. బడికిఁ బోయిన బిడ్డ రాబడికి సుంత
జాగు కలిగిన, సృష్టియే యాగిపోవు
బడిని విడనాడి తన ముద్దుటొడినిఁ బడిన
నాగి పోయిన సృష్టియే సాగిపోవు

10. తప్పటడుగులు వేయుచోఁ దప్పటడుగు
పడినఁ బడునంచు వేగిర బడుచు వచ్చి
యందుకొనబోయి తనచీర యడ్డ పడుటఁ
దానె పడిపోవునదిగదా, తల్లి ప్రేమ !

11. మగని కనుసన్నలకు మారు మసలనట్టి
యొక పతివ్రత తనబిడ్డకూడిగమ్ము
సలుపుచో భర్త క్షుత్పిపాసలను గూడ
కాంచ దయ్యెను లేని కార్కశ్యమూని

12. ఎదపై నిద్దుర వోవు బిడ్డని సుఖంబే సర్వమై సుంతయుం
గదలం బోదు, పిపీలకాది క్రిములే కన్పట్టినన్, ముట్టినన్,
రొద గావించిన, రక్తమున్ గొనిననేలోకంబు ప్రాప్తించునో
గద తత్తీవ్ర తపఃక్రియాచరణమున్ గావించు నాతల్లికిన్

13. ముద్దు పట్టిని నిద్దుర పుచ్చు వేళఁ
బాల కంటెను దీయని జోలపాట
పాడునేగాని గుండెలోపలను డాగి
వెతలు కలిగించునెన్నెన్ని కతలు గలవొ !

14. అమ్మయను మాటలోని తీయందనమ్ము
విరుల తేనెకు లేదు ; జాబిలికి లేదు
కన్న తల్లి కన్నులలోని కాంతిరేఖ
కవితకును లేదు ; మెఱుఁగు ఁదీఁగకును లేదు

15. ఇలనైనను, గలనైనను
గలవరమును బొందు నట్టి క్షణమున నమ్మన్
దలచుటయే ప్రతి నరునకు
నలవాటయి యుంట తెలుపునమ్మ మనమ్మన్

16. తొలిపల్కు వేదమందురు
తొలినమ్మాయంచుఁ బల్కుదురుగావునని
య్యిలలోనమ్మా యను నుడి
తుల తూగును గాదె సతము తొలి పల్కులతోన్

17. అమ్మా ! నీ మును ముద్దుటోగిరము నాకందీ గదే యంచు గా
రమ్మున్ బోయెడి వేళ జాబిలినిఁ బాలం బవ్వఁ జూపింపఁ బో
పొమ్మంచున్ విదిలించుఁ గోరినటులే ముద్దాడినం గాని య
న్నమ్మున్ ముట్టఁడు మాతృ చుంబన కళానందామృతాస్వాదియై

18. అమ్మా ! యన్నపుడెల్లనాయెడఁదలోనానంద వారాశి లో
కమ్మున్ ముంపఁగఁ జాలునుప్పెన యగున్ గాకున్నఁ గన్దోయి య
డ్డమ్మై కొల్కుల దారినీఁజెమరి బిడ్డంగాంచఁగా లేనివై
నమ్మే యద్దము మాతృ పుత్ర మమతానందాతిరేకానకున్

19. బడికింబోయిన బిడ్డ స్నేహితుల త్రోవన్ గ్రొత్త బంధమ్ములోఁ
బడునయ్యాటల మున్గి తేలు; జననీ బంధమ్ము గుర్తింపనే
రఁడు; నిర్లక్ష్యము సేయునాఁకలికిఁ దాళం జాలఁడేమాయె బి
డ్డఁడు రాలేదని తల్లి పిచ్చిదయి, వాడన్ వాడ శోధించెడున్

20. పదియారేండ్ల పయింబడన్ మనసు త్రోవల్ దప్పుఁగాంతామనో
హ్రదమందీదుట మోదమౌ సరస సల్లాపమ్ములే విద్యకుం
బదిరెట్లెక్కువ మక్కువౌ తనువు చేవం దక్కు - నా బిడ్డకున్
జదువే లోకము; చిక్కినాడనుకొనున్ సంతోష దుఃఖాత్తయై

21. చదువుల్ నేర్చిన బిడ్డ దాఁదనకుఁగా సంపాదనన్ నేర్చియ
య్యది మున్ముందుగ మాతృ హస్తమునఁ బోయన్ నాఁటి యానందనీ
రధికిన్ గల్గును వేయి పున్నములు; భార్యం గూడనా తల్లికిన్
బదివేల్ చీకటి రేలు తోడగుటనే భావింపదే వెఱ్ఱియై

22. తన సంతానము పెద్దదై, తనకు వార్ధక్యమ్ము - ప్రాప్తింప, భా
ర్యను సేవించిన రీతికిన్ శత సహస్రాంశమ్ము తన్మాతృ సే
వను గావింపననర్హమైనపుడు కోపంబన్నదే లేక, బి
డ్డను దీవించెడి పిచ్చి తల్లికిఁకఁ బట్టంబున్నదే కట్టగన్ ?

23. అమ్మా! యను నోరే ముస
లమ్మా! యన్నపుడు గుండెలవిసియు యమలో
కమ్మున్ బాపఁ గలండను
నమ్మకమున సైచుఁ 'బుడమి నరకమ్మ'టులే

24. గోరు ముద్దలు తిన్న బంగారు తండ్రి
పట్టెడన్నము పూటకుఁబెట్టలేక
కన్న తల్లినే యవల పొమ్మన్ననాఁడు
వాఁడు బ్రదుకుట యెంత దుర్భరము భువికి!

25. అంతు లేనట్టి జీవన యాత్ర యందు
నలసి పోయిన వేళ దేహమును విడువ
బాపురేయని గుండెలు బాదు కొందు
రామెకొనరించునంతిమ వ్యయము దలఁచి



# ౨. పద్యగర్జన

1. పద్యమ్మునెవఁడురా ; పాతిపెట్టెదనంచు
నున్మాదియై ప్రేలుచున్నవాఁడు?
పద్యమ్మునెవఁడురా ; ప్రాతవడ్డదియంచు,
వెఱ్ఱివాఁడై ; విఱ్ఱవీగువాఁడు ?
పద్యమ్ము ఫలమురా ! పాతిపెట్టిన పెద్ద
వృక్షమై పండ్ల వేవేలనొసఁగు;
పద్యమ్మునెప్పుడో పాతిపెట్టితిమేము
లోకుల హృదయాల లోతులందు;

ఇప్పుడద్దానిఁ బెకలింపనెవరి తరము ?
వెలికి తీసి, పాతుట యెంత వెఱ్ఱితనము !
నిన్నిటికి మున్ను మొన్ననే కన్ను దెఱచు
బాల్యచాపల్యమునకెంత వదఱు తనము !

2. సుమతి శతకమును మెచ్చని
కుమతులు తెలుగింటనొకరు కోటికిఁగలరే ?
సుమతి నశించిన చోఁబ
ద్యము మెచ్చరు ద్రాక్షపండులందమి పులుపే !

3. కవితా గానము సేయ వచ్చితి జగత్కల్యాణమాశించి కౌ
రవ సంతానము సాహితీ జగతిలోఁగాలూని గొంతెత్తి ఫే
రవ నాదంబొనరించుచో విజయగర్వంబుప్పతిల్లంగ నే
నవధానాయుధమున్ ధరించితిని కృష్ణా ! పూను సారధ్యమున్

❀ ఈ పద్యము శ్రీ వడ్డి శ్యామసుందరరావుకు అంకితం చేయబడింది.

4. అవధానాయుధమున్ ధరించితిని హాహాకారమే సాహితీ
రవమైనట్టి జగమ్ములో ( గవన సామ్రాజ్యానకున్ బూర్వగా
రవ వాసంత పునః ప్రతిష్ఠ కొఱకై రాకేందు తుల్యాస్యగా(
గవితా లక్ష్మిని( జేయ ఘీంకృతులకున్ గాల్దువ్వి గర్జించుచున్.

5. అవివేకంబును బంచిపెట్టు( గవితా వ్యాసంగమీ దేశ గౌ
రవమున్ మొత్తము మట్టు పెట్ట( గరవాల వ్రాతమున్ బూనె, శై
శవచాపల్యముతో, శచీపతికి వజ్రంబెట్టిదో, - మాకు మా
యవధానాయుధమట్టిదే సమర శంఖారావమున్ జేసెదన్



# 3. సాకిరి

* న్యాయ మార్గగాములకుఁ దిర్యక్కులైన
సాయపడుచుండునటులె. దుశ్చరితులైన
నరుల విడనాడుచుంద్రు సోదరులు కూడ;
అందులకు సాక్షి నాటి రామాయణమ్ము



* మురారి శ్లోకమునకు సగౌరవ అనుసృజన

# 4. పల్లవి

1. ఉన్నది కండపుష్టి, మదికున్నది యంతకు మించితుష్టి తో
డున్నది పెద్దసంతు, .తనకున్నది రెండెకరాల కొంౘ్ర యా
యన్నధరిత్రినమ్ముకొనునష్టి శరీరుఁడు చిన్నకారు రై
తన్నయతండు మేలుకొనునప్పుడె ధాత్రికుషోదయమ్మగున్

2. విందు భోజనమంచు వినుచుండుటయె గాని,
తరవాణి యన్నమే వరముతనకు ;
రకరకమ్ముల బట్టలను జూచునే కాని,
పంచెకట్టుటయె రుచించుఁ దనకు;
పంకాలతో గాలి పాటెరుంగును గాని,
మలయమారుతముపై మనసు తనకు;
వాహనమ్ములపైని పయనమ్ము గనుఁగాని
కాలినడకపైని కాంక్ష తనకు

గీ : విద్యుదుజ్జ్వల దీపాల వెలుఁగులందు
సొగసులను జిందు సౌధాలఁ జూచుఁగాని,
సూర్య చంద్రులు తనయింటి చూరులంటి
యాటలాడుదురదియ భాగ్యమ్ము తనకు

3. కైతలు చెప్ప లేఁడు, నయగారములెన్నియొ బల్కి వెన్నెలల్
పూతలు పూయలేఁడు, తన పోడిమి వాడి మగంటిమిం గనన్
జేతలు చూపలేఁడు, చెడు సేతలకై తలనొగ్గ నేతలన్
ఖాతరు చేయలేఁడు, తనకష్టము జాతికిఁ దీర్చునాకలిన్

4. కైతలు వ్రాయలేఁడు, తన గాత్రము కోకిలకొజ్జకాఁగ సం
గీతము పాడలేఁడసలు కేకట గెమ్మటలాడి, నవ్వులన్
బోతలు పోయలేఁడు; రసమో, ధ్వనియో యని శాస్త్రవాదనన్
వాతెర విప్పలేఁడు తన పాటున జాతికి, ఁదీర్చు నాకలిన్

5. ఎప్పుడు భూమి దున్ని మడికెప్పడునీటిని ఁబెట్టి, విత్తనా
లెప్పుడు చల్లనూడుపునకెప్పుడు వచ్చునొ, పైరుకోతకై
యెప్పుడు వచ్చునో యదియ యెప్పుడుఁ జెప్పఁగ సస్యశాస్త్రముల్
విప్పెడి పండితుండు తన భిక్షయ జాతికి దీర్చునాకలిన్

6. కైత పఠింపలేఁడు; పలు గాకుల లోకుల మాటలీటెలై
చేతమునందు గ్రుచ్చుకొనఁ, జేయఁగనేమియు లేక, తాలిమిన్
బాతర పెట్టలేక, కను పట్టు జగమ్ము పఠించు కొంచు, సం
గాతము వీడిపోని తన కామన జాతికిఁదీర్చునాకలిన్

7. కరవాలమ్మును జేతఁబట్టి రణ రంగంబందునం దూకి యు
ర్వరపై రక్తపుటేరులన్ నిలుపుఁ జేవల్ గాన రావయ్యు, భా
స్కరతైక్ష్ణ్యమ్మునకోటలేక కృషి నిచ్చల్ సల్పి, రక్తమ్మునా
విరిగాఁ జేయుచు, స్వేద వాహినులనుర్విన్ నిల్పి జోదయ్యెడిన్

8. చేయఁగ లేఁడు నాట్యమును సృష్టినిఁ బచ్చగ నిల్పి, నిచ్చలున్
సోయగముల్ వెలార్చుకొని చూపఱు దృష్టికి కేంద్ర బిందువై,
ప్రాయపు సొరు నింపుకొను బైరునకయ్యెడ వాయు వీచికల్
సాయము చేయుచుండఁ దన సస్య లతాంగికి నేర్పు నృత్యముల్

9. హరిపద జాత గంగ తన యారవ ప్రాణము, నాట్యమాడఁగా
హరుని శిరస్సు వేదియగునాపగయే తన యాప్తురాలు, ము
ప్పిరిగొని వచ్చు వాన తన పేరిమి బంధుగు, లోక పాలుఁడౌ
వరుణుఁడొకండె దైవతము, పల్లవి తానె సుభిక్ష గీతికిన్

10. ఆస్తికి పిన్నయయ్యునతఁడాదట వోవకయే వసుంధరో
పాస్తినిఁ జేయుఁ పెద్ద, మగ పాడిని క్షామము బీతుచెందఁగా
శాస్తినిఁజేయు దిట్ట నర జాతి సమస్త శుభ ప్రహేలకున్
పుస్తెల త్రాడు బోని తన ముంగిలి పంట వలంతి పీటయే

11. అతఁడు నాగలి వట్టి యగుపట్టెనా, సీరి
విసుమానమునఁ జూచి వెఱఁగు పడును
అతని రాకను గాంచి యపుడు కుక్కుట కోటి
కొక్కొరో కోయంచుఁ, గూయఁ దొడఁగు
అతని వేగము చూచి, హరిదశ్వ తేజీలు
చిడిముడింపడి తేరు చేరు కొనును
అతని మోమును గాంచినట్టి రిక్కల కోటి
సౌఖ శాయినికయై జారు కొనును

అతని పాదము సోకిన యంత మాత్ర
పుడమి తల్లికి యొక వింత పులకరింత
గుండియల పైని నర్తించుఁ గొడుకుఁ గాంచి
పరవశింపదే తల్లి సంబరము పడుచు

12. చిటపటమంచెదో చినుకు చిందెడు కాఱు మొయిళ్ళఁ జూచిము
చ్చటపడిపోవు, పాము కుబుసమ్మును వీడిన భంగి, నింగి య
క్కటికము మాని యాక్షణమ కన్పడి కాటియ వెట్టనేని, త్రా
క్కటపడి పోవుఁ గ్రోలు పులిగాఁ బశు కోటినిఁ బిచ్చలించినన్

13. అన్నదాతరో నీకడుపారగట్టి
భోగములయందు లోకాలు తూగుచుండె;
భాగ్య పంక్తియు చక్రార పంక్తి గాదా !
చివుకుచున్నట్టి నీది పై చేయి గాదా !

# 5. కావ్యాహుతి

1. తేఁడొక్కండు తెలుంగు వారలను బాలింపం దొరంకొన్న బల్
ప్రోడల్ మెచ్చిన "దీప కర్ణి"యను వీరుండున్ దయాలుండు, దోఁ
గాడంగా వెడవింటి తుంటరి సుమ వ్యాపారముల్ కోర్కి జీ
రాడన్ "శక్తిమతీ" సతీ సహితుఁడై, యారామ కేళీ మతిన్

2. నందిత మతియై చని, శ్రీ
నందన కేళీ విలాస నైర్మల్య సుఖ
స్యందనమునఁ బ్రేయో ని
ష్యందము గొని, యలసి విరుల సజ్జను వ్రాలెన్

3. పాప ఫలమేమియో ! యొక్క పాఁప తేఁడు
శక్తిమతి తనూ స్పర్శన రక్తిఁ గొనుచుఁ,
బూవుతాకునఁ గందెడు పూవుబోడి
తనువు పైఁజేసెనొక్క దంత క్షతమ్ము

4. విరుల బిగితగ్గ సజ్జకు బిగియుఁ దగ్గఁ
గలువ లేమకు మోమునఁ గలిమి తగ్గ
విరుల తూపుల కొంటె సంబరము తగ్గ
కాలచక్రవేగమ్మె తగ్గక గమించె

5. ఒడయని గుండియపైఁ జలి
పిడుగులు పడె మేలు కాంచు వేళకు విషపుం
జడివానలు, పెనుగాలులు
కడగండ్లు మిగల్చెనెంత గడుసరి విధియో!

6. బుడుతల్ లేని కొఱంత యొక్కటియుఁ దీపుల్ నించుచున్ గూర్మిపం
చెడి దేవేరి సుషుప్తి శాశ్వతముగాఁ జేకొంట రాజ్యమ్మునే
లెడినా యౌరసుఁడెవ్వఁడన్న దిగులుర్వీనాథునిన్ గుండె రా
యిడివెట్టన్ వసివాడు మోడువలె జీవించెన్ గృశాశక్తుఁడై!!

7. అతనికొకనాడు సింహవాహనుడు బాలుఁ
డడవిఁ గన్పట్టె; వెన్నెలల్ పొడమెనతని
యిరులు గప్పిన యెడఁదఁ గ్రొవ్విరులు పూచె
మోడు వారిన బ్రదుకున మొలకలెత్తె

8. ఆ సింగమ్మును గోలనేసి దునుమన్ యక్షాకృతిన్బూని, రా
జా! సాతుండను వాఁడనిట్టి దురవస్థన్ గొంటి శాపమ్మయో
గీశుండిచ్చె; విముక్తి నిచ్చితివి నీకే కాన్కలర్పింతునో
నా సంతానము కాన్కఁగా ఁగొనుమ ధన్యత్వమ్మునిమ్మంచుఁదాన్!!

9. తదపత్యమ్మునొసంగి తేని కొఱకంతర్ధానముంబొందఁ బె
న్నిధి కన్పట్టిన పేదవోలెఁ బసివానిన్ ముద్దులన్ ముంచి, శా
రద రాకేందు నిభాననమ్మొదయి వారన్, గౌగిటన్ గ్రుచ్చి సౌ
హృదమేపారఁగ సాకి, తేఁడు తనివోయెన్ భాగ్యయోగమ్ముగన్

10. చని, సదనమ్ము చేరుకొని, సాతుఁడు వాహనుఁడౌట సాతవా
హనుఁడను నామధేయమిడె, హాలుఁడు నాగఁ జెలంగె, శాలి వా
హనుఁడను బేరసాగె విభుఁడై, శుభలక్షణ యుక్తుఁడై, యశో
ధనుఁడయి, రాజ్యమేలెఁ గవితా పరిశీలన శీలసంపదన్

11. రాజభాషయైనఁ బ్రాకృతమ్మునఁగైత
నాదరించుచుండు హాలనేత;
అతని యనుఁగు రాణియైన లీలావతి
యమర వాణినెంచి యాదరించు

12. సచివ ముఖ్యులైన శర్వవర్మగుణాఢ్యు
లమర భాషయందునధికుఁడొకఁడు;
ప్రాకృతమ్మునందుఁ బ్రాజ్ఞుఁడొక్కండు వా
రలకు వారె సాటి పలుకుఁ గలిమి

13. భాషాభిజ్ఞతయే రసజ్ఞతకు జీవంబౌను; గైర్వాణ మం
జూషన్ డాగిన రత్నకాంతులను గాంచున్ జూడ్కులానంద పీ
యూషాస్వాదనసేయనోపును; రసాభ్యుత్థానమార్జించుఁ బ్ర
త్యూషమ్మెంచనినాఁడు సంస్కృతము రాకుంటన్ వృధా జన్మముల్

14. అని లీలావతి యివ్విధ
ముననెకసెక్కెముల దెప్పి పొడుచుటచే రా
జునకొదవె పౌరుషము భా
షను నేర్వఁగ వలయునంచు సంకల్పించెన్

15. సచివ ముఖ్యులైన శర్వవర్మ గుణాఢ్య
విజ్ఞ వరులఁ బిలిచి, వేల్పు బాస
నేర్పుఁడంచుఁ బలుక, నెచ్చెలి యానంద
వార్ధి మునిఁగె; శర్వ వర్మ మురిసె.

16. కాని, గుణాఢ్యుఁడు కపటపు
టానందము తెచ్చికొనుచు, " వ్యాకరణమునన్
జ్ఞానము గావలె ముందుగ
నేనది యారేండ్ల యందె నేర్పఁగలాఁడన్"

17. అని వచియింప జేనికవురా! యది యెవ్విధి సాధ్యమౌను బా
లనమునసంచుఁ, జింతఁగొను రాజునుగాంచిన శర్వ వర్మ మీ
రనుమతినిండు, నేర్పఁగలనయ్యది మీకొక యర్ధవత్సర
మ్ముననె యటంచుఁబల్క, విసమున్ గురిపించె గుణాఢ్యుఁడత్తఱిన్

18. ఈమెర మెచ్చు పల్కులు వచించుట మోసము సేయఁగాదె, బ్రా
హ్మీమయ మూర్తికేనిఁ, బరమేష్ఠికి నేనియు శబ్ద శాస్త్ర వి
ద్యామతి కాఁగనేండ్ల బడి యభ్యసనమ్మొనరింపకున్నఁగా
దే మఱియెట్లు నేర్పఁగలవీవిఁక మీరక వత్సరార్ధమున్?

19. ప్రాకృతము వీడి, వేల్పుల బాసవీడి,
రాజ సన్నిధి వీడి, యిల్లాలి వీడి,
యడవి యందుండి మునివృత్తి గడఁగువాఁడ
నటుల చెప్పుట నీచేత నయిననాఁడు

20. అని శపథము సేయు గుణా
ఢ్యునిఁగని అంపిల్లి, గరళమియ్యఁగనేలా?
విను నా శపథము; బానిస
తనమున నినుఁ గొల్తు బాసఁదప్పిన యెడలన్

21. శర్వవర్మ గుణాఢ్యుల శపథములకుఁ
బుడిమి చలియించి పోయెనప్పుడమి ఱేఁడు
ప్రత్యయమ్మును బొందె సభాస్థలాన
గుజ గుజలు వోవు వ్యాఖ్యాతృ గోష్ఠి జరిగె

22. సాధన సేయుచున్ గొమర సామినుపాసన సేసి శాస్త్ర వి
ద్యాధునినీదులాడనవధానత తేనికి శిక్ష సేయుచున్
బోధన సేయ దీక్షగ విభుండు గ్రహించెఁ గుమార శబ్ద వి
ద్యాధనమర్థ వర్షమున దక్కెను బాసయు శర్వ వర్మకున్

23. ఆడిన మాటఁదప్పక గుణాఢ్యుఁడు పందెము నొడ్డి యందుఁ దా
నోడుటఁ జేసి "భూ విభునినోమును గావుత దైవ"మంచు, బా
సాడుచు, మూఁగయై, సుతులనాలినిఁ బ్రాకృత కావ్య కన్యకన్
వీడుచుఁబోయి కాఱడవి వేసరుచున్, గడపెన్ విరాగియై

24. మౌన ముద్రను దాల్చు విజ్ఞాన ఖనికి
సాధితంబయ్యె భూత పిశాచ భాష:
యదియ పైశాచి ప్రాకృతమ్మయ్యె; రుధిర
కజ్జలము తోడఁ దీయని కైతలల్లె

25. ప్రాకృత భాషయందు రస భావము క్రొత్త హొరంగు పండి గా
ధాకృతి దాల్చెఁ గాఱడవి యందు వసించెడి మూఁగ జీవుల
య్యాకథలాలకించి, తనినందఁగ శ్లోకములేడు లక్షలై
ప్రాకటమైన కావ్యగుణ వైభవమందె బృహత్కథాఖ్యమై

26. వీనుల విందు గాఁగఁ బ్రభవించిన యీ కృతిఁగాంచి హాల భూ
జానియ దీనికిం తగుఁ బ్రచారమునీఁగల వాఁడు, స్నేహబం
ధాన రహించి పోవు జననాధుఁడు హాలుఁడు దివ్య నందనో
ద్యానమునందు నిల్పుఁ గవితారతిఁ బ్రాకృత కావ్య కన్యకన్

27. అడవినిఁ బుట్టిన వెన్నెల
నడ యాడుచు, లోకమందు నలుదెసల పదం
పడి వెల్గు లీనఁగావలె
నుడుగరగాఁ గృతిని లోకులూహింపవలెన్

28. అనుచుఁ దలంచి గుణాఢ్యుఁడు
తన శిష్యులఁ బిలిచి చెప్పి, ధరణీ పతికిన్
వినిపింపుడి యని పంపిన
జన విభుఁడు తిరస్కరించి, జల్పములాడెన్

29. భూత ప్రేత పిశాచ భాషణ కళాభ్యుత్థానమై సాగు భా
షాతత్త్వంబును రక్త వర్ణములుగా సాగెన్ భళా ! కావ్యమౌ
రా ! తన్మాత్ర కవిత్వమబ్బురముగా రాజుల్ ప్రశంసింతురే
కైతన్ గాఁడడవిన్ జెదల్ తినుటకై కల్పింపుఁడాహారమున్

30. హాలుననాదరమ్మును గుణాఢ్యుఁడెఱింగి, కరమ్ము కృంగె, భూ
పాలుఁడు దేశికేంద్రులకుఁబట్టిన గౌరవమిట్టిపాటిదో !
ఊలు కఱంగఁగైతల వరాలుగ గానము సేసి ప్రాకృత
శ్రీలఁ గడానికిన్ సురభి చేర్చి రమించు దినమ్ములేగెనో !

31. ప్రాకృతమ్మునఁ గైతలు వలుకునట్టి
కవులనౌదలఁ దాల్చి, భూ కనక రత్న
రాశులిచ్చెడి ఱేఁడు తిరస్కరించి
కాల రాచెను గవిజాతి గౌరవమును

32. వాకొని నాఁడు ప్రాకృతము, వాకొను వారల మెచ్చినాఁడు వ
హ్వా ! కవి యన్న నీవయని యాదలఁ దాల్చి, ప్రశంససేసి, నే
డీకృతి క్రిందు సేయఁ గతమేమియొ? సంస్కృత భాష నేర్చినన్
బ్రాకృతమన్న రోఁత జనపాలుఁడు హాలుఁడు పొందనేటికిన్

33. నిన్న గాక మొన్న నేర్చిన సంస్కృత
భాష సర్వమాయెఁ బ్రాణమట్లు
పెంచుకొనిన భాష వెక్కసమై పోయెఁ
గ్రొత్త వింత - ప్రాఁత రోఁత గాదె

34. ఎద బడబానలమ్మును భరించు మహోదధి, భావ భంగ సం
పదలకుఁ బుట్టినిల్లునవమాన తిమింగిల నక్ర కశ్మలా
స్పదము, విరక్తి హాలహల సంకలితమ్ము, విశిష్ట సాహితీ
మధురస పూరితమ్ము కవి మాన్య గుణాఢ్య గుణాఢ్య యోగికిన్

35. హాలుఁడనాదరించిన హుతాశనుఁడేని సమాదరించుఁగా
కోలము గర్భమందు నను కూరిమి పల్కుల యందుఁ జిల్కు భూ
పాలుర కంటె నా కృతికిఁ బావకుఁడే తగువాఁడు యజ్ఞ యా
గాలకుఁ గ్రొత్త భాష్యమగుఁగావుతమియ్యది కావ్య హోమమై

36. అనితల పోసి సత్కవి గుణాఢ్యుఁడు చట్టునఁ బిల్చి చట్టులన్
విని గురునానతిన్ సాదను బేర్చి హుతాశనునందుఁజేర్చి పా
వన గుణశీల నాకవన్య బాలను మైథిలినట్లు కూర్చి వే
దన పరిమార్చుడీ, పలు విధమ్ములనర్చన సల్పుఁడర్చికిన్

37. ఇది కడసారి యానతి రచించిరి సేవలు మున్ను పెక్కు నా
హృదయము సందడింపఁగఁ బఠింపుఁడు దిక్కులు పిక్కటిల్లఁగా
జదలు ప్రతి ధ్వనింపఁగ దిశా ద్విపముల్ వెఱగొంద, భూమి గ్ర
క్కదలఁగఁ బత్ర పత్రము మృగమ్ములె శ్రోతృ గణమ్ములివ్వనిన్

38. గురుని ముదలకు మారాడఁ దరము గామి
శిష్యులిరువురు తల యూచి చితినిఁ బేర్చి
యెద రగిల్చెడి చిచ్చు బహిర్గమింపఁ
జేసి, గాసిలి, విధి నిరసించినారు

39. రక్తము ధారవోసి, కృతివ్రాసి, శరీరము డస్సి పోఁగళా
రక్తిమ కుంటు వడ్డ ప్రభులన్, గుహనా కవితా సరస్వతీ
భక్తుల విశ్వసించి, క్షణ భంగుర జీవన యాత్ర యందు, ని
శ్శక్తుఁడనైతి, నా గగన సౌధము నేలకుఁ గూలి, సోలితిన్

40. ఏడు సంవత్సరములు శ్రమించి కంటి
నేడు లక్షల గుణములనేర్చి కూర్చి
యేడు జన్మల బంధమో, యేమొ ! మీది
యేడు నాల్కలు గలవాఁడ ! యేలు కొనుమ !

41. అనుచుఁ జింతిల్లుచుండ నిర్జన వనమ్మ
పత్ర బాష్పమ్ములను రాల్చి పక్కి యెలుఁగు
నెత్తి రోదింపనోదార్పనెంచి గాడ్పు
వచ్చె, హితుఁగాంచి యనలుఁడుప్పరమునంటె

42. అంతేవాసులు శ్లోకము
సాంతము పఠియించి, పత్రమందీ గురుఁడ
త్యంత గభీరాకృతి యా
భ్యంతర కృతి కన్యనగ్నికందీ సాగెన్

43. చార చక్షుష్కు(డైన భూజాని కావ్య
హోమ విషయమ్ము నాలించి యొక్కమారు
గతము తలపోసి, యెదను దుఃఖమ్ము పొంగి
పొర్లి పోవ(గనెదురీది మును(గి పోయె

44. అడవికిఁ బోయి వైళమ గుణాఢ్యు పదమ్ములు కంటి నీటితోఁ
గడుగుచు, మొత్తుకొంచుఁ, దమ కైత పఠించెడి భాగ్యమూర్వికే
ర్వడ దయఁ జూపుమయ్య యపరాధిని బ్రోవుడు హోమమాపుడీ,
యడుగుల నంటి మ్రొక్కెద క్షమార్హు(డనంచుఁ గరమ్ము వేడ(గన్

45. సంతస మంది భూవిభుని సందిట(జేర్చి కవుంగిలించి ధీ
మంతు(డు, శాంతమూర్తి యవమాన గతాగ్రహవిస్ఫులింగమొ
క్కింతయు రాజనీక మునుపెన్నడు లేని సుఖానుభూతిలో
వింత(గ( దేలుచున్, దనువు వ్రేల్చె గుణాఢ్యు(డు యోగ వహ్నిలో

46. కావ్య హోమమాగెఁ, గవియ యాహుతియయ్యె
గృతి యొకింత భూమి పతికిఁ దక్కె
నొక్కకంట నగవునొక కంట వగపాయె
నశ్రుబిందు యుగళ మవనిఁ బడియె



# 6. తొలినుడి

1. వేనకు వేల ఏేండ్లు ప్రభవించి, వసుంధరనేలినారు; ప్ర
స్థానము సేసినారు కవితా తరుణీ కరమందునట్టి ప్ర
జ్ఞా నిధి యొక్కఁడే భువిని శాశ్వతుఁడై, వెలుగొందుగాని యెం
దేనియు రాజ్యముల్ నిలుచునే? యవి కీర్తికిఁ దావలమ్ములే !

2. దేశీయమునందునఁగవి
దేశికుఁడెవఁడైనఁ గవన దీక్షామతియై
యాశయమును నెఱవేర్చిన
నాశాంత యశమ్మునాంధ్రి యందునుగాదే,

3. మరచితిమిన్ని నాండ్లుగ క్షమామతిఁ బ్రోవఁగదమ్మ! యాంధ్రభూ
వరులము మేము నిర్జరుల బాసలకే తల యొగ్గి మేలి యా
భరణములిచ్చి, తత్కవన వల్లభులన్ గొనియాడి, తల్లియు
ర్వర బలెఁ దల్లి బాసఁ దనుపందగునంచనెఱుంగమైతిమే

4. తల్లిచాటునఁ బెరిఁగిన తనయవౌట
నేమొ ! యగుపింపవైతివీవిన్నినాండ్లు
తల్లి ఋణమును దీర్పని తనయులయిరి
తెలుఁగులను వాదు నేటితోఁ దీరునమ్మ

5. పారమతిన్ రచింపఁగల జాణను దెల్గునఁ గైతలల్ల శ్రీ
కారము చుట్టునట్టి ఋషి కల్పునినొక్కనిఁ జూపుమమ్మ, సిం
గారము చక్కదిద్దుకొనఁ గాఁదగుదీవు జయాఖ్య కావ్యమే
భారత కావ్యమై తెలుఁగు వారల డోలలనూచుఁ గావుతన్

6. మాతృత్రాణమ్మునను దీర్చఁబూనకయ సన్మానింతుమే దైవహా
క్చాతుర్యమ్మును లేదు లేదు కవితా సమ్రాజ్ఞి! మందాకినీ
స్రోతః పూత సరోజ సంభవ మధు శ్చ్యుద్వాహినీ మంగళ
స్నాతన్ జేయుదుమాంధ్రి భారత కథా సంధాన తేజస్విగన్

7. అనుచున్ వందురు రాజరాజునకు విద్యా భారతీ కీర్తివ
ర్ధనుఁడాంధ్రీ హృదయాంబు జాత మధుధారాధార శబ్దార్థ భా
జనుఁడారాధ్యుఁడు, నైష్ఠికుండును, మన స్సంకల్పమున్ సార్థకం
బును జేయంగల నన్నిభట్టు కుల విప్రుండర్హుఁడై తోచుటన్

8. నాఁడుర్వీపతి గుండెలోతుల మహానందాబ్ధి మిన్నంటె
నాఁడెవ్వాఁడునునూహ సేయనిది యాంధ్రమ్మందు నిన్నేండ్లుగా
మోడుల్ వారిన జాతి భావుక కళా పూర్ణేందురోచిస్తతుల్
జాడల్ సూపఁ బురోగమించు నను విశ్వాసమ్ము సంధిల్లుటన్

9. మఱునాఁడే సభనేర్పరించి, గురు సన్మానంబు కావించె సుం
దరసంకల్పమనల్ప భారత కథా ధర్మస్థితిన్ భవ్యమం
దిరమై, యాంధ్రమమందమై, కవనవాణీ నాట్యవిన్యాస ని
ర్ఝరులన్ స్నానమునాడునంచుఁ దనివారన్ జెప్పెనప్పట్టునన్

10. హైందవ ధర్మసంగతికినాయువు పట్టగువాఁడవంచునా
నందమహాప్రవాహమునవడ్డులెరుంగని యీతనేర్చు మ
ధ్యందిన భాస్కరోజ్జ్వల వియత్పరిణామ చిదాత్మతత్త్వని
ష్యంద నిమజ్జితాత్ముఁడవటంచుఁ దలంచెద నన్నపార్యుఁడా!

11. భవ వినాశంపుఁబల్కు మార్దవము చిల్కు
భవుని స్తుతియించునట్టి గైర్వాణి ఠాణి
యజుని వలపించుఁ గల్కినీయందుఁగుల్కు
నెన్నఁజాలుదునే నిన్ను నన్నిభట్టు

12. వేదసారాబ్ధియందీఁదులాడఁగజాలు
మత్స్యరాజమవంచు మదిఁదలంతు
నుపనిషద్వనరాజినురిమి గర్జనసేయు
మృగరాజమీవంచునెంచుచుందు
హైందవాచారాఖ్యమవనీస్థలి భరించు
దిగ్గజేంద్రమవంచునుగ్గడింతు
యార్షవిజ్ఞానాబ్ధినమృతమ్ము చిందించు
మోహనాకృతివంచునూహగొందు

సంస్కృతము వల్కుచో బృహస్పతివి నీవు
తెనుఁగు వినుఁగోర్కి నేడు కల్గినది నాకు
వ్యాసవిరచిత జయకృతినాంధ్రమందు
నాకునంకితమ్ముగఁ బల్కునన్నపార్య!

13. కవనమును సలుపుటయు సవనమును సలుపుటయు
నెవరికయినను సుకృతమవునది యథార్థం
బవిరళ కృషిని సలిపి, ప్రవిమల రసము నిలిపి
తొవచెలుల హితునిఁ బలెఁ గవితలను వ్రాయన్
సవితృగతి వెలుఁగునట, పవనుగతిఁబరఁగునట
కవిఘనత జగతిపయి నవనవత గొంచున్
గవనమతివగుటఁ బలుకవగణన సలుపకయ
యవఘళమును కనఁబఱచి కవియుఁగృతినిమ్మా

14. సంతసము మేన గిలిగింతలిడఁబ్రేమమెయి వింతయగు
వత్సలత స్వాంతమున నిండన్
దంతువునఁబూవులననంతములు గూర్చునటులాంతరము
పద్యములనంతములు గుప్పన్
పంతమున దీక్షఁగొని, వింతనవధానత ఘటింతువని
ధీమతి రచింతువని యీనా
యాంతరము పల్కెడినినెంతయును దెల్గుల వలంతులను
జేసెడి వలంతివిఁక నీవే !

15. తత్వైదుష్యవిశేష సంగతులతోఁ దార్కొన్న నీబుద్ధికిన్
స్మృతియై, సద్గతియై, విశేషనతియై సింగారమున్ జూపు, సం
గతి గైకొన్న కవిత్వసుందరికి శ్లోక స్థానమున్ గూర్చు, భా
రతి కాంధ్రత్వము నేర్పుమయ్యసుకవీ ! రంజింపుమాంధ్రావనిన్

16. శ్రీకరముగానిపుడు చిత్తములు రంజిలఁగఁ
జేయఁదగు భారతము మందా
రాకృతిని నెమ్మదిని హ్లాదకరియై, నిలిచి
యాదరము తోడ నిను విద్యా
శ్రీకుఁడనిపించుకొనఁజేయుఁ బలుకుం జెలియ
శీఘ్రముగనాదికవివౌచున్
వీఁకఁగవితామృతము వీనులకు విందొసఁగ
విజ్ఞతనొనర్పఁగదె వేగన్

17. చక్కని సంస్కృతుల్ గురియు శారద నీముఖరేఖ శోభిలన్
మిక్కిలి భక్తి, పెద్దల సమీకరణంబున భాషణంబునన్
దక్కని యుక్తి, పాణిని పతంజలి నాలుకఁదొంగి చూడ, స
మ్యక్కులితార శబ్ద నిచయంబుల నింపెదవెంత జాణవో !

18. తెనుఁగుననొక్క కబ్బమును దేనెల సోనలు జాలు వార !వ్రా
సిననది తెల్గుజాతి మును చేసిన నోముల పంటకాఁగ, నం
దనవన పారిజాత సుమదామ పరీమల భాగధేయమాం
ధ్రినిఁదనివోవఁ జేయదె, క్రృతిన్ విరచింపుము భారతమ్ముగన్

19. భావావేశము వెన్ను తట్టినది శ్రీ వాణీ నియోక్తవ్యమై
త్రైవిద్యుండగు వ్యాస సత్కవి మహార్థప్రౌఢిఁ జూపించి, వి
ద్యావాచస్పతి యౌచుఁ జెప్పుఁగృతికాంధ్రత్వమ్ము కల్పించి, భా
షావారాంనిధి పుక్కిటంగొనుమగస్త్యత్వంబు నీ సొత్తుగా

20. చంద్రవంశస్థుఁడైనట్టి జనవిభుండు
పలుకుఁ బలుకున సుధలను జిలుకుచుండ
కరఁగి నీరయ్యె నన్నయ్య కవి యెడంద
చంద్ర మణివోలెఁ దత్సభాస్థానమందు

21. పలుకులు గావు జీవిత విభావరిఁ పండిన నిండు వెన్నెలల్
చిలుకుట గాని, వంగడము చేసిన నోముల-పంట పండఁగా
దొలకరి గాని, నీ యెడఁద దూరుపు ప్రొద్దుదయించె నేటికీ
తెలుఁగునఁగైత తమ్మినును తేనియలన్ గురిపించు భూపతీ !

22. కలవై పోయిన తెల్గుకైతలు వినన్ గాంక్షించి,నేత్రాంబువుల్
చిఱుమన్ జేసితి కావ్యసాధనమునన్ జేయూతనందించి నా
చిఱుముల్లాడు మనస్థితిన్ దడవి సంజీవించు నీ కామ్యమున్
నెఱవేర్తున్ గృతి భారతమ్మునది యెంతే క్లిష్టతన్ బొందినన్

23. చెఱువై నిల్చిన ప్రేమ వర్షపురసశ్రీ మాకు స్నానార్హమై
నెఱియల్ విచ్చిన బుద్ధిభూమి సమతన్ దిద్దించి, శాంత్యోషధుల్
చిఱువేఱుల్ పొలయింప, మమ్మరసి సంజీవించు నీకామ్యమున్
నెఱువేర్తున్ గృతి భారతమ్మునది యెంతే క్లిష్టతన్ బొందినన్

24. అఱచున్ గుండెలనాదరించి, చెలిమిన్ స్యందించి, నేనుంటినన్
నెఱవాదిన్ నిను జిత్త పీఠమున సంనిష్ఠించి, ప్రేమంబునన్
జిఱు నవ్వుల్ చిలికించు భావముల సంజీవించు నీకామ్యమున్
నెఱవేర్తున్ గృతి భారతమ్మునది యెంతే క్లిష్టతన్ బొందినన్

25. నెఱవేర్తున్ భవదీయ కామ్యమది యెంతే క్లిష్టతన్ బొందినన్
దరియంజెల్లునె భారతాంబుధినినీఁదన్ జెల్లునే వీనికిన్
దఱుఁగున్ జెందని శక్తినింపి కవనోత్సాహమ్ము సంధింపనే
ర్పఱతున్ బ్రాణములున్నయంత దనుకన్ వాగ్దానమాలింపుమా

26. పండితులన్న భక్తి, కవివర్యులపైయనురక్తి ప్రేమతో
నిండిన యాత్మశక్తి, గణనీయముగాఁ బ్రచురించు యుక్తి నీ
కుండుట వింతగొల్పు సమయోచిత వాక్చణ! యిన్ని నాండ్ల బ్ర
హ్మాండము వంటి కోర్కెనెటులాంతరమందున దాచినాఁడవో!

27. నీకొలువునఁగవినౌటన్
బ్రాకట్యమునొంది, కావ్య రాజంబుపహా
రాకృతి నడిగినఁగానీ
యీకుంటయ సిగ్గుఁదగ్గు నేర్పఱచెఁజుమీ

28. పాయక పాకశాసనికి భారత ఘోర రణమ్ము నందు; నా
రాయణునట్లు, మిత్రుఁడు ధరామర వంశ విభూషణుండు నా
రాయణ భట్టు తోడయిననాంధ్ర పురంధ్రికి భూషణంబుగా
వ్రాయుదు భారతమ్ము కవి పండిత మండలి మెచ్చునట్లుగన్

29. ఆయెడఁ గొల్వు వారి కనులన్నియుఁ జూచుచునున్నవాక్క నా
రాయణ భట్టునే పులకలంకురమై వచియింపరాని; యే
దోయను భూతి యూయెలలనూచినయట్లనిపించి పల్కెనా
ప్యాయతనిండ ధన్యుఁడనహో యని గాద్గదికమ్ము నిండఁగన్

30. శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ యనుచున్ శ్రీకారమున్ జుట్టి, యాం
ధ్రీవాఙ్మాధురి యంతరంగమున సందీపించి నైర్మల్యముల్
త్రోవల్ జూప, లిఖింపఁబూనె, గురుమూర్తుల్ మెచ్చిదీవించి, త
న్నావేశింపఁగ గంటమూని వివిధాఖ్యానాత్తమున్ గావ్యమున్

31. ప్రాతః కాలమునందులేచి, భవునారాధించి, యాసీనుఁడై
చేతోZ బ్జ స్ఫురణమ్ము తోఁచుటకుఁ బ్రాచీ జాత విజ్ఞాన ఖ
ద్యోతున్ భావన సేయుచున్, గథల లోతుల్ చూచి, మందాకినీ
స్రోతమ్మున్ మనుపల్కు సారణుల నించున్ సాగుఁగావించుచున్

32. అవిరళమగు సత్కవితా
వ్యవసాయమునందు రెండు పంటలు పండెన్
భువికవియే యాధారము
లవుననుచున్ బలుకుచుందురమృతాంధసులున్

33. అంతనరణ్య పర్వకథయందున గంటమమందశక్తిమై
కొంత గమించెఁగాల మృగ కూటము బాటకు నడ్డువెట్టి, మా
వంతుగనున్న యీ గహన భాగమునందుఁ బరిక్రమింపనీ
కెంతటి సాహసమ్మిచటనే నిలుమంచును గర్జసేయుటన్

34. శారద రాత్రులుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులన్
జారుతరంబులై వెలుఁగుఁ జాడ్పులు పోయి, పిశాచ భీకరా
కారకఠోర రాక్షస సృగాల మహారవ కంపనంబులన్
ధారుణిఁ గన్నుగానని విధమ్మున గ్రమ్మెను గాఱు చీఁకటుల్

35. నిలచిన దల్ల గంటమన నేరదు రాజమహేంద్ర గౌతమీ
సలిల సరోజపంక్తి వికచత్వ మహత్త్వమునాంధ్ర సత్త్వమున్
గలిమికిఁ దావలంబయిన కమ్ర కవిత్వ సుగంధ వీచియున్
వెలవెల బోయి నిల్చినవి వెల్లువలైనవి యశ్రుపాతముల్

36. భారత భారతీ కవనవైభవ రాజ్ఞి యరణ్య మధ్యసం
చారముసేసి చేసి, ముఖసారసమాతప రశ్మిసోకి, సిం
గారము దక్కిస్రుక్కి చెడుకాలము దాపురమయ్యె, బాపురే
పారముముట్టఁ జేయగల భవ్యుఁడు పుట్టఁడెయంచుఁగుందెడిన్

37. దవ్వులకేఁగినావు వసుధాస్థలినొంటరిఁ జేసి, గుండియల్
త్రవ్వెడి శోకభారము వెతల్ గలిగింప భరింపఁజాలనీ
నెవ్వగలన్ మిగిల్చి తగునే, చనఁజెల్లునె? లేదు లేదు దౌ
దవ్వులగాదు, మాయెదల దాగినవాఁడవు నీవు నన్నయా !

38. పదునెనిమిది పర్వమ్ములు
గదిసిన కృతికన్య నాదు కరమందునటం
చెదఁదలపోసితిఁ గానీ
విధి వ్రాతకునెదురు గలదె, పృథ్వీస్థలిపై?

39. రెండున్నర పర్వమ్ముల
ఖండముగా నడిపినట్టి గంటము కాలో
ద్దండతర రోష పాశము
చెండుట నామంద భాగ్య శేషము గాదే !

40. అని దురపిల్లి నరేంద్రుఁడు
తన యువ రాజునకు సకల ధరణీ భార
మ్ముమునప్పగించి నన్న
య్యను దలఁచు నిమిత్తమాత్రుఁడై జీవించున్



# 7. ఆంధ్రి

1. సంతానమ్మునకై తపించిన హరిశ్చంద్రుండు పెక్కేండ్లుగాఁ
గాంతారస్థితుఁడై తపశ్చరుఁడు గాఁ గన్పట్టి - శీఘ్రమ్ముగా
వింతున్ నిన్నొక పుత్రవంతునిఁగ గానీ పుట్టుబిడ్డండు నా
వంతై యజ్ఞపశుత్వమందవలె; హవ్యమ్మేను గైకోవలెన్

2. అంచున్ బల్కఁగనీటి వేల్పు, విని యౌరా ! ధుర్విధీయంచు రో
దించెన్ భూవిభుఁడెట్టకేలకటులే యిమ్మంచు సంతానమున్
గాంచెన్, రోహితుఁడంచుఁ బేరిడియెనుగ్రస్ఫూర్తిఁ దామృత్యువై
పొంచెన్ మాటను నిల్పుకొమ్మనుచు మాపున్ జేపు రాపాడుచున్

3. కనులు విప్పక మున్ననీగాదటంచుఁ
బురిటియంటు దొలంగని బుడుతయంచు
దంతములు రాక బలినిడఁ దగ దటంచుఁ
బాలపండ్లివి, నిలువఁగాఁ జాలవనుచు

4. కవచి, ధానుష్కుఁడును గాని క్షత్రియుండు
సవన పశువుగా నిలుపంగఁ జాలఁడనుచు
పెక్కుమిషలను జూపి గట్టెక్కఁ జూచుఁ
బట్టి లాలించుఁ దలవ్రాతఁ దిట్టుకొనుచు

5. కవచియు, ధానుష్కుండై
సవన పశువు కాఁగ దగిన సమయంబనుచున్
జెవులంబడి, పిడుగుల వలెఁ
గవియఁగ నిఁక మిషలుగూడ కఱవైపోయెన్

6. పట్టినిఁ జేరఁబిల్చి, తనబాహులలో బిగియించి ముద్దులన్
బెట్టుచుఁ గన్న తండ్రి ! నిను బెంచిన చేతులె వాడి కత్తులై
పట్టి వధింపఁబూనినవి ; బాపురె! యెంతటి నిర్దయుండన
న్నెట్టి మహాపరాధమొనరించిన పాపము చుట్టుకొన్నదో!

7. అని విలపించుచున్ గొమరునక్కునఁ జేర్చి కవుంగిలించి నో
చినతొలు బాము పున్నెములఁ జిక్కిన పెన్నిధి నిన్నుఁగాద్రవే
యునిగతి మ్రింగ జూచితిఁ గదోయి, యెడంద కఠారముగాఁ గసా
యినిగదటోయి యంచుఁదన కేర్పడఁజెప్పెను బూర్వసంగతుల్

8. ఎడఁదనుదర్చి రేగ ధనురేక సహాయుఁడు ముద్ద గుట్టి య
య్యెడ విడనాడుచున్ బడుకకేనియునుందెలియంగరాక కా
అడవులకేగెనా సవనమాగెను, వేల్పు శపించె తేఁడు తా
నొడఁబడిమేనఁదాల్చెను జలోదర రోగము ముట్టఁడన్నమున్

9. తండ్రిబుణమును దీర్పని తనయుఁడేల
పాపదేహమ్ముపైనింత తీపియేల
క్షాత్రధర్మమ్ము నాలోన సమసిపోయె
నంచు రోహితుఁడడవి యందలమటించె

10. వడివడి సాగుచుండెఁ బితృ పాదు ఋణమ్మును దీర్ప దేహమే
యుడుగర సేయఁగా వరుణుఁడొంద ముదమ్ము మహేంద్రుఁడడ్డమున్
బడి, పలుసాకులన్ నుడివి, పట్టిన పట్టునతేని పట్టి, లోఁ
బడునటు బోధసేసెఁ దనవైనము జన్నమునడ్డుకొంటయే

11. నరమేధము జరుగుటకై
నరుఁడొక్కఁడు వలయునన్య నర పశువునకై
తిరుగాడెద ; వెదకుటకై
దొరకొందునటంచు రోహితుండు దలంచెన్

12. కనుబట్టెన్ దనముందుఁ బాఋఁడునజీగర్తాఖ్యుఁడత్యంతని
ర్ధనుఁడై యెమ్ములగూటిఁ బోలఁగ నపత్య శ్రేణియున్, దారయున్
తనవెన్నంటి గమింప, రోహిత పరిత్రాణైక దక్షుండుగాఁ
జనుదెంచున్ భగవంతుఁడై, విధి విలాసం బేరికూహ్యంబగున్?

13. పుర నివాసము వీడి, భూధరములంటి
గృహములను వీడి సాంద్ర భూరుహములంటి
తిరుఁగచున్నట్టి కతమేమి? తెలియఁజెప్పుఁ
డెవరుమీరని ప్రశ్నింపనిట్లు చెప్పె

14. తిరిపెంబెత్తుచుఁబొట్టఁ బోసికొని పత్నిన్ బుత్రులన్ సాకుదున్
సిరికిన్ దూరుఁడ, మందభాగ్యుఁడ ( బురిన్ జీవింపఁగాలేక కా
పురమున్ బెట్టితి నిందు, బిడ్డలు శున : పుచ్ఛుండు శేపుండును
ర్వరలాంగూలుఁడు నా విభూతి యిది నావైనమ్మజీగర్తుఁడన్

15. వడినెడమ కంటనశ్రువు,
కుడికంటను మధులవమ్ము కురిసినవి పదం
పడి బాపఁడు వినిపించిన
బడుగు చరిత్రమును విన్న బాలుండడిగెన్

16. సంతానమ్మగ నన్నుగాంచెను హరిశ్చంద్రుండు మేధ్యమ్ముగా
వింతున్ నన్నని మ్రొక్కి, ప్రాణములపై పేరాస పీడింపనీ
కాంతారమ్ములఁ బట్టి వచ్చితిని నేఁ గాకున్న నాతండ్రి భూ
కాంతుండే విడనాఁడుఁ బ్రాణములు రోగగ్రస్తుఁడై శప్తుఁడై

17. కనుక మూగురు కొమరులు కలరు నీకు
నందునొక మొల్కనిచ్చి నీవందు కొనుమ
వలసినంతటి ధనమునీఁ గలను నేను
రోహితాఖ్యుఁడ సాధ తిరోహితుండ

18. అనుచున్ దొరలెడునశ్రుల
వినిపించిన దీనగాథ వినుటన్ బాపం
డును, బత్నియుఁబటు కోపం
బున నిష్ఠురములను బలుకఁబూనిరి వగలన్

19. తరువునకుఁ గాయ బరువైనఁదరువు బరువుఁ
బుడమి తాల్చుటకెట్లోడంబడుట జరుగు ?
దందశూకమ్మనే ? కన్నతండ్రినయ్యుఁ,
గొడుకు మడుపుచుఁ బబ్బమ్మ గడుపుకొనఁగ

20. నీ ప్రాణములట్టివిగా
మాప్రాణములెంచఁబోవె మహికిన్ సురలా
విప్రుల నెత్తుటఁ దడిసిన
నప్రామాణికము జన్మమవనీ పతికిన్

21. అన్నా ! నీవొక రాచపుట్టువట ! దేహభ్రాంతినల్లాడినీ
జన్నంబందున నాదుబిడ్డనికిఁ బంచత్వమ్ము కల్పించి యే
పున్నెంబున్ గొననుంటివో ! యిదియపో భూజానికిన్ ధర్మవా
పన్నున్గావఁగఁ బూర్వమెందఱొ విభుల్ ప్రాణమ్ములర్పింపరో !

22. పలికిన పల్కులవ్వి విభుపట్టికిఁ బట్టునఁ జెంప పెట్టులై
చిలికిన, కంటినీరెడఁద జీల్చెను, గాల్చెను విస్ఫులింగమై
తలనటు వ్రాల్చినిల్చెఁ బరితాపముతోఁ బలుకాడ నేరమిన్
"గలిమికి పుత్రబంధ మమకారములమ్ము జనమ్ములుందురే?"

23. పాపము రాచపట్టి దురవస్థ, శరీరము మీఁది యాస్థ, సం
తాపమునందు తేఁడు; పరితాపమునొందెడి వానిజోడు , నా
బాపినఁజాలు మోక్షపద వైభవముల్ పదివేలుగా శున
శ్శేపుఁడు డెందమందుఁ దలచెన్ దలిదండ్రులు కుందివందఁగన్

24. మూగురమేము, టేనికిని(బుత్రు(డొకండ జలాధిదైవతో
ద్యోగమునందు నేను బలినొందెదనేని సుతద్వయంబుతో
నాగత విత్తమంది సుఖమందు(డు రాణకురాని పుట్టువున్
ద్యాగము సేయనిండనుచునార్తిని రెండవ కొమ్ము చాగిలెన్

25. అనువుగ( బరిపరి విధముల
జననీ జనకులకు ( జెప్పి, సమ్మతినెటులే
గొనుచున్ గడపటి వీడ్కో
లును గైకొని సాగె ద్విజు(డు రోహితువెంటన్

26. పాలగుంజకు బంధింప(బడ్డవాడు
పాలచెక్కిళ్ళ నును మురిపాల వా(డు
భూసురుని పట్టి( గుశపాశములను గట్టి
వారి యాయువు గొను రాచపట్టి నా(డు

27. తనిసి యెకిమీ(డు నీటివేల్పునకు మ్రొక్కి
జన్నమును జేయ(బూనె సంస్కరణ విధికి
బ్రహ్మ, యుద్గాత, హోత, యధ్వర్యులపుడు
సలుప వేదగానమ్ముౕనుచ్చైస్స్వరముల

28. పుడమి దొరపట్టి యెడ(ద కేర్పడియె నగవు
పుడమివేలుపు పట్టికేర్పడియె దిగులు
కర్జమొక్కటి సుఖము దుఃఖమ్ము నొదవె
చిత్రమైనట్టిదీ వింత సృష్టిగాదె!

29. తల్లియు( దండ్రి సోదరులు తద్దయు నొదల(దాల్చి ముద్దు(గొ(
గిళ్ళను దన్నునా సుఖము క్రిందు(గ జేసితి ; మిత్తి గండు చె
క్కిళ్ళను ముద్దువెట్టుకొను గ్రీడకులో(బడి వేల్పుతేని లో
గిళ్ళకునాస(గొంటి( బరికింపక; యెంతటి వెఱ్ఱినైతినో,

30. బ్రతుకుపై తీపియింతలోఁ బల్లవించె
నాయురాశను మన్నింపుమయ్య! వరుణ!
నన్ను బ్రతికించి రాజనందనునిఁగూడ
దయను జూడుమటంచుఁ బ్రార్థనముసేసె!

31. భూసురనందనుండిటుల మ్రొక్కుచు దైవత కోటికెల్లనా
యాసితుఁడాయె నాకమునకంటఁగనాపరిదేవనార్భటుల్
పాశధరుండు గుండియ కరంగినదో, కనుబట్టి, పాశముల్
త్రోసె; జిగిర్చెఁ బ్రాణములు రోహితుఁ గాఁచెను గాఁచె భూపతిన్

32. మునివిశ్వామిత్రుఁడు బా
లునిగని ముద్దాడి తనదులోగిలికిం గై
కొనిపోయి సాకె నిజనం
దనుబలె నాంధ్రుఁడను సుతుఁడు దానెదిర్చెన్

33. పుడమి వేలుపు టేండ్లకుఁ బూజ్యుఁడగును
క్షాత్రమున్నట్టి మాకునగ్రజుఁడు కాఁడు
పుడమి దొరపట్టి రక్షింపఁబూనినాఁడు
చివరి గడియకు బ్రదుక నాశించినాఁడు

34. ఇట్టి భీరువుఁబట్టి రావించి మీకు
నన్నయని పల్క క్షాత్రసంపన్నమైన
రాజగౌరవమింకుఁ దిరస్కరింతు
నంచుఁ బలుకఁగ మునిజేవురించుఁగనుల

35. నన్నునెదిర్చు నంతటి వినమ్రతగల్గిన నిన్ను గన్న నా
పున్నెము పున్నమాయెనిఁకఁ బొమ్మి కనుంగవ ముందునుండి లే
కున్న సహింపఁబోనని మహోగ్రతఁ జెండిననాగ్రహించి, తాఁ
గ్రన్ననవేఁగి, వేఱొకట రాజ్యము సేయఁగ వెళ్లెనాంధ్రుఁడై

36. ఆంధ్రీ పురంధ్రి చంద్రాననమ్మున నన్న

పార్యుండు కుంకుమంబలఁదినాఁడు

కలువ కన్నుల జంట గాసి నంటఁగనీక

తిక్కన్న కాటుక దిద్దినాఁడు

కేశప్రబంధమ్ము కీకాటవిగనుంట

నెఱ్ఱన్న చిక్కుతీయించినాఁడు

ప్రాఁతవాసన వోవఁ బైడి నీటినిఁ బోసి

శ్రీనాథుఁడభిషిక్తఁ జేసినాఁడు

పోతనకవీంద్రుఁడమృతమ్ము వోసినాఁడు

పెద్దనాదులు భూషలం బెట్టినారు

సరసకవి జాల వల్లికా శాలలందు

హేలనూయలలూగెనాంధ్రీ లలామ.



# 8. ఉప్పు గోదారి

1. పుట్టినదాది స్తన్యమును ముట్టి సుఖించిన జాడలేదు; జో
కొట్టినవారు లేరు; తనకుంగల యాకలి తీర్పనన్నమున్
బెట్టినవారు లేరు? నడివీధికిఁ బోయెడు వేళఁబ్రక్కకున్
నెట్టనివారు లేరు పయనించుచునుండెననాథ బాలయై

2. పుట్టుకనిచ్చి యానిసుగుఁ బుట్టిన తత్క్షణమందె కొండపైఁ
బెట్టెను; కాదు కాదు పడవేసి యధేచ్ఛగ సాగిపోయెఁజే
పట్టినవాఁడు ధూర్తుఁడయి, పాపము మోసము చేసెనేమొ! యీ
పుట్టినబిడ్డఁజూచి జనముల్ వెలివేయుదురంచు జంకెనో !

3. గుండెను బండచేసికొని కూరిమి నేరమి జాలి మాలి యా
కొండకునప్పనమ్మెడినఁ గొండకు బండతనమ్ము సాజమై
యుండును గాన, గుండె యసలుండదు గాన దయావిహీన పా
షండము గాననా నిసుఁగు సాకుటనేర్చునె! క్షుత్తుతీర్చునే?

4. పొమ్మనినెట్టివైచెఁ బడిపోయెడి బిడ్డకునడ్డువైట్టు నై
జమ్మణుమాత్రమేనిఁగనఁ జాలనిలోకమునందు దొర్లి;సాం
ద్రమ్మగునట్టి యొక్క విపినమ్మున బడ్డది పొర్లి-పొర్లి శో
కమ్మును బెట్టసాగెనగుఁగాక నిజానకరణ్యరోదనల్

5. జన్మనిచ్చిన తల్లియే జాలిమాలె
గుండెలేనట్టి కొండయు బండబారె
సుంతదయగొని కాంతార కాంత బిడ్డ
కమ్మయై సాకెఁ గందమూలమ్ములిచ్చి

6. కాలము సాగుచున్నది యొకానొక చిత్త వికారమేదియో
లీలగ సోకుచున్నది విరించి సృజించిన ప్రాణికెక్కడో
యేలిక యుండుఁ దత్ర్పణయమే ముడి వస్తువు సృష్టి సేతకా
బాలను యౌవనమ్ము చెరఁ బట్టిన దెవ్వడు చెట్ట బట్టునో !

7. ఎవరే చెప్పిరొ! తానుగాఁదలఁచెనో! యీ యౌవనంబెల్లను
ద్దవిడిన్ గానుక వెట్టగా గొనెడి సత్త్వమ్మున్న వాఁడొక్కఁడే
భువిరత్నాకరుఁడే యటన్న తలపుల్ మొల్కెత్తె; వెన్వెంటనే
తవిలెన్ దుంటరి పూవుటమ్ము లెదలో తల్లీలలేపాటివో !

8. పయనము చేయసాగినది భావ భవైక సహాయయై, రసో
దయమును జూడఁగోరినది తత్ప్రియ వల్లభు బాహు బంధనా
శ్రయమున సార్వకాలిక విలాస చమత్కృతిమత్ప్రబంధ సం
చయమున సందడుల్ కొనలు సాగెను సంగడి కాని సంగడిన్

9. కడలిరాయని కౌగిటం బడుట కొఱకు
నెంత తొందర! యంచలకెదిరి నిల్చు
నడలు విడనాడి, వేగిరపడుచు వడిని
సాగు. రేబవల్ క్షణము విశ్రాంతిలేక

10. అడవినిఁ దీవ కన్నెలు లతాంతములిచ్చి యలంకరించినా
రిడుములు వొందకుండఁ బయనింపుము నాథునితోడ సౌఖ్యముల్
వడయుమటంచు దీవెనలు వల్కెను భూజములెల్ల, వేళకుం
గుడువుమటుంచు శారికిలు కోకిలలుం బలుకాడె మాటికిన్

11. ఆపయనమ్ములోఁ గలిగినట్టి విశేషములెట్లు చెప్ప సే
వాపరమార్థ చింతనము పట్టినదో పదమూనుచోఁదనూ
తాపము చల్లఁ జేసినది ధాత్రికి పచ్చనిరంగు పూసి లో
లోపలఁగల్గు గోరికల లోతులు చిక్కఁగ నీదు వేనికిన్

12. దాహముతీర్చి-తీర్చి, జనతాపరితాపము మాన్పు నిస్తుల
స్నేహము చేసి-చేసి, రససిద్ధి గవీశులఁబ్రోది సేయు, మి
ధ్యాహ్నృతి మాన్పి-మాన్పి, పరతత్త్వము మౌనులకందఁజేయుఁ గాం
తేహను దాచి-దాచి, రచియించును బెక్కుపరోపకారముల్

13. ఎంతపావన మూర్తియో యేగు వేళ
ధేను వధ కృత పాపమే తీరిపోయె
పుడమి తల్లికినొడలెల్లఁ బులకరించె
నడుగు సోకినఁ జాలు సస్యముగ మారె

14. నడకలవే తొలిపద్దెపు
నడలకు బెడఁగులను గూర్చునరపతి, జేజే
నుడినుండి దేశి నుడిలో
నుడికారమునందు మిగుల నూల్కొనఁజేసెన్

15. భారతమ్మిచ్చినది, భాగవతమునిచ్చె
నాంధ్రనైషధ హరవిలాసాదులిచ్చె
తెలుపు చీరకు రంగుల కలిమి పులిమె
రాణ మిగులంగ నాంధ్ర పురాణమిచ్చె
ముందె యిట్లిచ్చెఁ బెండ్లితాంబూలములను

16. భద్రంకరుండైన భద్రాద్రిరామన్న
పాదముల్ కడుగుఁదపమ్మ్ము చేసి
జానకీ సాధ్వినిన్ జలకమ్ము లాడించి
విమలయై మిగుల పున్నెములు గాంచి
నైష్ఠిక ప్రవర సంధ్యావందనార్ఘ్య ప్ర
దానార్థమగుఁబయోదానమిచ్చి
యవతార దశకమందాది భూతమ్మైన
సంతతిన్ బ్రేముడిన్ సాకుచుండి

గీ. నిత్యకోటిలింగార్చనా నిష్ఠనూని
పాప కూప సంసార తాపోపశాంతి
యుండునన్నాళ్ళు వ్యసన దాహోపశాంతి
చేయుచున్నది పయనమ్ము చేయువేళ

17. ఒకతీయనగు వేళ, ఁబికకోటి ఋతుగీత
మాలించి విరహమ్మునందు మునుఁగు
ఆదిత్యునకు దప్పి యతివేలమగువేళ
నందించి జలము తన్వంగి యగును
కడుపు పంటకు ముద్దులిడు ఘనాఘన మోద
బాష్పమ్ములకుఁ బొంగు వారుచుండు
పలు దివ్వియలదారి చలివెల్గు చూపింప
నా తేల మోము విప్పారుచుండు

బంతిపూబంతులను జడపాయఁదుఱిమి
పండుటాకులపై వ్రాయు వలపు కతలు
కలుగు వ్యాకోచ సంకోచములకుఁజలిత
తనువు తానయ్యుఁ దన ప్రేమ ధనము తిరము

18. కడలిరాయఁడు తన యేలుబడినిఁజూపి
యెడఁదకెదఁ జేర్చుకొనుమేఁలి గడియనాకుఁ
గలుగునోలేదొ యనుకొంచుఁ గనలి కలఁత
పడెడి వేళలో యోచనల్ సుడులు తిరుగు

19. ప్రాణికోటికిక్షుత్పిపాసలం దీర్చితిఁ
బాపమ్ములడచి సంబరము పడితి
తొడుకుఁజంపిన కీడుఁ గుడుచుఁదాపసికంటు
నడుసుమూలము మట్టు కడిగియుంటి
కడుపులోఁబెద్ద చుక్కాని కలంచిన
నీవలావలకు దాటించియుంటి
బలవంతమగుఁ జెల్మి కలుష కుల్యకుఁగూర్ప
మేకొనిలో దిగమ్రింగు కొంటిఁ

బతినిఁజేరుటకై సాయపడడొకండు
న్యాయమార్గగాములకుఁ దిర్యక్కులైన
సాయపడునన్న కవివాక్యసత్యమయ్యె
నంచుఁగన్నీరు వఱదగా ముంచునొకట

20. అదనున నాథుఁజేరుకొనునప్పుడు తోడుగ వచ్చిరా ప్రియం
వద, యనసూయ గాధి సుతు పట్టికినెట్టియవస్థ పట్టినీ
ముదితకుఁదోడు నేననుచు ముచ్చటకేనియుఁ బల్కువారు లే
రది పగవారికేని మనమందుఁదలంపఁగరాని కష్టమౌ!

21. పుట్టియేడ్చుచోఁదల్లి జోకొట్టకున్న
ఊళ్ళ ఊప్పలంబడు వేళఁగాళ్ళు పగుల
సానుభూతికి నోచని జన్మమయ్యె,
విభుఁడు సుఖపెట్టునంచెంచు వెట్టితల్లి

22. గిరి కొనన్ బుట్టి యొక్క నిర్ఝరిగ మారి
తరుల తోపులనాడి, దిక్కరులఁ దడిమి
యఖిల దేశాలు పయనించి యాత్మవిభుని
దరిని నిలిచిన నరసింహపురముచేరె.

23. సాగరునిఁజేరు సమయమాసన్నమాయె
యిన్ననాడుల కలలు ఫలింపనుండెఁ
దీపి యూహమ్ములకు రూపు తెలియుచుండె
వలపు కతలకుఁదుది మెఱుంగులు రచించె

24. అమరేశ్వరుండజస్రాభిషేకోత్సవా
నందుఁడౌటకు సుధాబిందులొసఁగె
కపిలమల్లేశుని కడగంటి చూపు వె
న్నెలసోకి కొంగ్రొత్త వెలుఁగుఁ గాంచె
మదన గోపాలుని మధుర వేణునినాద
ములకెల్లఁదనువు వీనులుగ మారె
రాజగోపాల లీలా హేలలకుఁ దోఁగి
సరసయై పలుమారు పరవశించె

చిలకమర్తికి బ్రహసనమ్ములను నేర్పె
వాసి కైసేసె దీక్షిత దాసకవికి
శాశ్వతమ్మైన హరికథాసారమొసగి,
సర్వసెట్టిని సంఘ సంస్కర్త సేసె

25. ప్రఖ్యాతిన్ సమకూర్చి పెట్టినది దివ్యల్లీల ముక్తీశ్వరో
పాఖ్యానమ్ము రచింపఁజేసి, విబుధుండై, కృష్ణమాచార్య భ
వ్యాఖ్యన్ వర్తిలు, శాస్త్ర బోధన కళా నాకాధిపాధ్యాపక
ప్రఖ్యుండై, మను దేశికాగ్రణికి, లీలాలోల పుంవాణికిన్

26. కడలి రాయని యొడిలోనఁ బడుదునన్న
ప్రత్యయము పోయి, పోయి విలాస వృద్ధి
యామె లావణ్యము లవణమయ్యెనేమొ
సౌరు కోల్పోయి యుప్పుగోదారియయ్యె

27. వేమూరి రామగోవిందశాస్త్రికి దేవ
భాషాసరస్వతీత్వమ్ము కలుగ
నవనవోన్మేష చింతా దీక్షితుని కథా
వాఙ్మయమ్మునకు వైభవము కలుగ
కాళ్లకూరికి కీర్తి కలిమిపెంచిన నాట
కద్వయంబునకుఁజిక్కణము కలుగ
శతవధాన విధాన సమ్రాట్టు పదవి కా
కర్ల కొండలరాయ కవికిఁగలుగ

గీ : ఘనత వేంకట సుబ్బయ్య కవికిఁ గాని
లలిని వంగల పార్థసారథికిఁగాని
మొక్కపాటి నిర్మిత పాత్రమునకుఁగాని
కలిగినది యుప్పుగోదారి వలనఁగాదె

28. శతక సారస్వతాంభోధి గతులెఱుంగు
ఘనుని వంగూరి సుబ్బరాయనిఁ దలంచి
పులకిత స్వాంతయై యాటు పోటులనెడి
చలనమును బొందుఁగ్రొత్త సొంపులు దలంక

29. ఆమె యొడ్డునఁగాదె యద్భుతమ్మయిన; రా
మానుజాచార్యాలయమ్ము వెలుఁగు
ఆమె యొడ్డునఁగాదె యలనాఁడొలాందుల
వ్యాపారమునకుఁ బ్రాభవము పెరిగె
ఆమె యొడ్డునఁగాదె యల్లిక జిగి, లేసు
దారమ్ములకుఁగూడఁదారసిల్లె
ఆమె యొడ్డునఁగాదె యల్లూరిలో పౌరు
షాగ్ని బీజావాప్తి యలముకొనియె

ఆమె యొడ్డునే సుబ్బరాయాఖ్యుఁడొకఁడు
తనరి విజ్ఞాన శాస్త్రవేత్తగ వెలింగె
ఘనుఁడు 'భాస్కర్ల' స్వాతంత్ర్యమునకుఁ బోరె
లవణ జలమునకెన్ని లీలలు ఘటిల్లె

30. టేలరనుదొర యొక పాఠశాలనిలిపె !
సర్విసెట్టియు స్త్రీ కళాశాలనిలిపె
నెల్లిమిల్లి కళాశాల నేర్పరించె
నుప్పు గోదారి విద్దెల కుప్పయయ్యె

31. మమతననురాగమునఁ గృత్రిమమ్ము హెచ్చె
మనిషి జీవనమ్మునఁ గృత్రిమమ్ము హెచ్చె
సహజతకుఁగాలమే చెల్లు సమయమందు
సహజ వాయువులచట రాజ్యమ్ము సేసె

32. రత్న నిలయుని యొడలెల్ల లవణ మగుట
లవణమయి తానునొక పతివ్రతగ నిలిచె
నాటి గాంధారినుండి యీనాటి వఱకు
భరత దేశమ్మహో, పతివ్రతల భూమి !

33. కులమో కాక మతమ్మొ కాక ధనమో కొట్లాటకున్ హేతువై
బలవంతుల్ బలహీనులన్ మలపు దౌర్భాగ్యమ్ము పోనాడఁగాఁ
గల వాఁడొక్కఁడుఁగానరాని జగతీ కార్కశ్యముంగాంచి, ని
స్తుల వాసిష్ఠ నదీ పవిత్ర జలమిందున్ క్షారమైపోయెనో !

34. రసమన్న లవణ రసమే
రసమట తక్కొండు రసము రసమౌనే, నీ
రసమగు; రసోనమగునా
రసములు పరిణతినిఁ జెందు లవణము వలనన్

35. అంతర్వేది నృసింహమూర్తి పదపద్మార్చాక్రియాలోల ని
త్యాంతారమ్యగుణ ప్రసిద్ధుఁడగు నీప్రాణేశునింగూడి ని
శ్చింతాయత్త విశిష్ట చిత్తవగుచున్ శ్రీవారి సేవింప నీ
వంతమ్మా ! సహధర్మచారమదియే వాసిష్ఠ గోదావరీ !

36. నరసాపుర వైభవమును
సరసులు పెక్కండ్రు పెక్కుఁజాయల వర్ణిం
చిరి యాత్రోవనె నేనును
నరకొర పలికితి సఫలుడనగుదునొ, లేదో !



# 9. పసిమనసు

1. బాలకులార ! మీ యెడంద వాకిటిలోఁదల దాచుకొన్నవాఁ
డేలిక యీధరా జనులకెల్లరకోట్లను గొల్లఁగొట్టు వా
రేలికలౌదురే ! కటిక రేయినుపాసన సేయువారు దీ
పాలకు నూనె వోయుదురె ? బాల పురోగతి కిచ్చగింతురే ?

2. పిల్లలు చందమామలని పెద్దలు చెప్పఁగ వింటిఁగాని, జా
బిల్లికి మచ్చయుండుటయొ, పెద్దగుటో యణగారి పోవుటో !
యెల్లలు కల్గియుండుటయొ; యేగ్రహణంబుల పాలఁజిక్కుటో !
చెల్లునె చందురుండు సుఖజీవులకీ పసివారికీడునాన్

3. పల్లవి ప్రాణమంట ప్రతి పాటకు జాతికినేని బాల్యమే
పల్లవి గాక, యేమి ? యది ప్రాణముగాక, మరేమి ? నేటియీ
పిల్లలె రేపు పౌరులయి, వెల్గుదురా పసివాని గుండెలో
జల్లకుఁడయ్య మీరు విష సంస్కృతి విత్తులు ; పుణ్యముండెడిన్

4. కులమోకాక మతమ్మొకాక ధనమో కొట్లాటకున్ హేతువై
బలవంతుల్ బలహీనులన్ మలపు దౌర్భాగ్యమ్ము నర్తించుని
య్యిల యందున్ బసి వారె సర్వసమతా సృష్టి క్రియాదక్షులై
వెలుగం జాలిన బ్రహ్మమానససుతుల్, వేదాంతులున్, యోగులున్

5. పూవులలోని మార్దవము పొందికగానొక ముద్దసేసి, క్రొం
దావులనెల్ల గూర్చి, సమతాగుణ రూపముగానమర్చి, భృం
గావలి విందునే పలుకులందునఁ గూర్చిన బ్రహ్మయెంత వాఁ
డో ! విరి జాతి కాత్మ సఖుఁడో, పసివాఁడు సుగంధ జీవుఁడో !






# 10. దీపావళి




అరిపేద కండ్లయందలము కొన్నది యమా
వాస్య వానికి రాక పండువెపుడొ



కన్నె జీవితమందు(గమ్ముకొన్నది యమా
వాస్యదానికి రాక పండువెపుడొ !



క్రొత్త కోడలి రొమ్ము కుమ్ముచున్నది యమా
వాస్య యామెకు రాక పండువెపుడొ



విద్యార్థి బ్రదుకుపై పీటవేసినదమా
వాస్య వానికి రాక పండువెపుడొ !



అపుడె దీపాళి పండుగ యగునుగాని
ప్రస్తుతమ్మునకిది క్షణ భంగురమ్ము



ఇప్పుడెన్ని దివ్వెలను వెల్గించుకొన్న
రాదు పున్నమి మనకు తైలమ్ముచేటు










# 11. మైత్రి

కన్నీరడ్డము చేసి దగ్గఱయినన్ గన్పట్టు దూరమ్ముగా
నెన్నే యామడలేగినన్ మదికి తానెంతే సమీపమ్మునం
దున్నట్లుండును, స్నేహబంధనమునందున్నట్టి వైచిత్ర్యసం
పన్నంబట్టిద యోర్వజాలరు సుహృద్వైధుర్యముల్ మానవుల్



# 12. ధార్మికత

శ్రీ గరిమమ్మ వేలుపుల తేనికిఁ బూవిలుకానికిన్ క్షమా
యోగము బుద్ధదేవునికినుండదు శేషునకేని రామచం
ద్రా! గణనీయ శీలుఁడవు ధర్మశరీరుఁడవయ్య జానకీ
యోగ వియోగ యోగజ వియోగములైనవి నీకు యాగముల్

శ్రీ-సంపద. శ్రీ-శోభ

క్షమా-ఓర్పు. క్షమా-భూమి

యోగము-కలయిక (సీతతో వివాహము)

వియోగము-విడిపోవుట (సీతను రావణుడెత్తుకపోవుట)

యోగజవియోగము-కలయికనుండి పుట్టిన ఎడబాటు

(జనాపవాదముచే అడవికి పంపుట)



# 13. చిత్త వృత్తి

1. వేసవి వచ్చి మీద పడి వేఁచిననాఁడు రవిప్రతాపమున్
దోసమటంచు దూఱెదరు తోయద పంక్తులు కుండపోతగాఁ
బోసిన వానకున్ దడిసి ముద్దగుచున్ జలికిన్ వడంకుచో
నీసరిలేరు లేరనుచు నీరజబంధుని మెచ్చి మ్రొక్కరే ?

2. వెన్నెల వానలో, వలపు వెల్లువ పొంగులు వారు వేళలో
వన్నెలు చిన్నెలుం బ్రియుని పొలగువేళ హిమాంశు బింబమం
దున్నది వెన్నముద్దయనుచుందురదే విరహమ్ము కల్గినా,
అన్నెల రాజునే కఠినుఁడందురు; వింతలు చిత్త వృత్తముల్

3. పాలకంటెను దన తల్లి లాలిపాట
యెంతయో తీపి, కాంత వరించెనేని
నాటి పాటకంటెను దల్లి పాటుకంటె
భార్యయే తీపి, తీపి తత్ప్రణయ గీతి

4. పసిపాపనైనేలఁ బ్రాకువేళలనమ్మ
పాటకే మిగుల సంబరముపడితి
అఆలలోనమ్మ యావులంగాంచుటన్
జదువు సంజలకు ముచ్చటలు పడితి
వయసులో నిండు యౌవనముల్లో ప్రమదావ
నమ్ములో తిరుగనానందపడితి
ధనమునే జీవనేంధనమునే హృదయనం
దనమంచునెంచి తొందరలు పడితి

బిడ్డ నెత్తుటలోగల పెద్దరికము
గనుట యెప్పుడా!.యనుచు వేదనల పడితి
ఇన్నియును గూడెఁగాని యదేమొగాని
మరల పసివాడనౌటకు మనసుపడితి

5. అవును జీవనమ్మొక్క చక్రార పంక్తి
క్రింద మీదౌటలోఁ గల చందమెల్ల
అంతు చిక్కక పయనించునవనియందు;
వింత వింతలుగా చిత్త వృత్తిసాగు

6. పాట పాడుటయే మనో భావమాయె
పాట యెదనుండి యొక్కింత బయటపడదు
భావమెదలోన సాగెడి పైడితీగ
చేయి తాకని తీగయే చిత్తవృత్తి



# 14. శాంతి సుధ

1. ఒక చీమవెన్క వేఱొక చీమ యేక సూ
త్రతగాంచి, జీవన గతులు నేర్పు
ఒక పక్కివెన్క వేఱొక పక్కి యేకతో
రణమౌచు నింగినలంకరించు
ఒకచిన్కు వెన్క వేఱొక చిన్కునేక వ
ర్షమ్మౌచు భువికి సస్యమ్ము సంగు
ఒక పువ్వువెన్క వేఱొక పువ్వునేకమా
లగ మారి దైవగళమ్ము చేరు

చెట్టు వెనుకఁజెట్టు, చెట్టు ముందఱ చెట్టు
చెట్టు ప్రక్కఁజెట్టు చిక్కబడుచు
అడవి దుర్గమముగనలరారుచుండదే
యింత మాత్రమెఱుఁగవేలనోయి !

2. ఒక్కజాతి సుమములుద్యానవనమందు
నుండునే ! యటున్న నిండుతనమె !
ఇన్ని కులమతమ్ములిమిడియుంటయగదా
భరతదేశ కీర్తి వైభవమ్ము

3. నడము బిగించి, శాంతి సహనమ్ములనేగహనమ్ములందునే
యడుసునఁద్రొక్కి పెట్టిరా ! రయమ్మునమాపిరి పోయ రండు క
వ్వడివలెనొక్కఁడొక్కడు చివాలునఁ జివ్వకుఁ బూనుడే
ర్పడియె నిరస్త్ర శస్త్ర సమరాన స్వతంత్రతత గుర్తెరుంగుడీ !

4. కోపములేలొకొ తాపములేలొకొ కూరమివీడుట లేలకనో !
ఈ పార పొచ్చములేల, కులేక్షణలేల మతేక్షణలేలకనో !
ఈ పృధివీ జల వహ్ని సమీరములీగగనమ్ము సమైక్యముగా
చేపిన కూరిమి పాలను గ్రోలగ చీటికి మాటికి పోరుటలా !

5. ఆ పరమాత్ముని ముద్దుల మూటలకన్నియెడందలు పాత్రములే
దీపపు కాంతుల దొంతరలంగొన దిక్కులు నాలుగు పాత్రములే
పాపలు రువ్వెడి నవ్వుల పువ్వుల వన్నెల చిన్నెల లోకములో
ఏ పారపొచ్చెములున్నవి ? జ్ఞానులకేర్పడుచుండుట చిత్రములే !

6. పుట్టిన వేళమతమ్మునెఱుంగఁడు; పోయెడువేళ స్మరింపఁడుగా !
పుట్టిన నాడు కులమ్మునెఱుంగఁడు; పోయిననాఁడు గ్రహింపడుగా !
పుట్టుట-గిట్టుట మధ్యను నిల్చిన బూటకమై, యొక టక్కరిదై,
పట్టిన దయ్యము వీడుట యెప్పుడొ ! భారత మాతృ సుఖంబెపుడో !

7. భారత మాతృ తనూజ, సమస్తము భారతి సంపదకౌరసమే
మారణ హోమము, దారుణ మార్గము మానవ నైజము కాదు సుమా !
కౌరవ దుశ్చరితమ్ములు సాగెడి కర్కశ కాలము చెల్లెనులే
సారపు ధర్మముపాస్యముగా నరజాతి సమస్తము పాండవమౌ

8. నీ నా అనరాదు సుమా
మానవతయె మన కులమ్ము మనమతమనుమా
ఏనాడును శాంతిసుధా
పానమ్మె మనకు రక్ష భరతాన్వయుఁడా !



# 15. కవితాలతాంగి

1. ఎదియో వ్రాయఁగరాదొ ! సోమరితనంబెట్టబ్బెనో మీకు, మీ
హృదయమ్ముంన్ గదిలించునే విషయమో ! యేరూపమో ! దానికిన్
సదసద్యోచన తోడుగాఁగవనమున్ సాగింపుఁడీ యంచునిం
టిది యఱ్ఱాకట పెట్టుచున్నయదిగానీ ! యేమి వ్రాయందగున్।

2. ఆవేశమ్మొకటే కవిత్వమగునా ! యానందమో ! గాక, భా
షా వైదగ్ధ్యమొ! కల్పనా పటిమయో ! శాస్త్రీయ దృక్కోణమో !
ప్రోవుల్ పెట్టుటయే కవిత్వమగునా ! పుల్లయ్యో ! యెల్లయ్యో! వ
హ్వావహ్వా యనుటే కవిత్వమగునా ! స్పందింపమిన్ గుండియల్॥

3. గుండె స్పందింపకుండ వాకొనెడి వారు
గుండె కదలాడునట్లు వాకొనని వారు
కవులు కారన్న నా నమ్మకమ్ము విడిచి
యెటుల వ్రాయుట యంచు యోచించుచుంటి

4. అంతలోననే మా చెవులందుఁబడియె
మల్లె మొగ్గలో ! యనుకేక, మనసు పడుచు
ఒక్క యుదుటున నా యింటి యువిద గెంతి
విరులు కొన్నది మఱి మఱి బేరమాడి॥

5. ఎంత విచిత్రమో! విరులకింతులతోనొడఁగూడు నెయ్యపున్
వృంతము, వేణితోఁబెనయు బింకము, మాపును, మాపు వాటికై
పంతము, భర్తతో చిఱు వివాదమునందుటనే ప్రమోదమున్॥
గాంతలు పూర్వజన్మమునఁగారనరాదు గదా ! లతాంతముల్॥

6. అనుచు లోలోనఁదర్కించు కొనుచునుండి
అయ్యరో ! డబ్బులిమ్మంచు నవలినుండి
ఒక్క కేకను వినుటతో నులికి పడుచుఁ
జిల్లరను బుష్ప విక్రేత చేతఁబెట్టి॥

7. ఎంతటి భాగ్యమో ! విరులనింటికి నింటికిఁ ద్రిప్పువేళనా
సొంతము వాటి సౌరభమునాచికొనంగల జన్మనీది, నీ
చెంతకుఁబాడు వాసనలు చేరవు, నీ విరికేక విన్న యే
కాంతకునైనఁ జిత్తమునఁగల్గక మానవు పుల్కరింతలున్ ॥

8. గుప్పెడు మల్లెపూలు తనకుంబతి దేవుడు తెచ్చి, యిచ్చెనా
చెప్పఁగరాని సంతసము చేకొని, యా మగనాలు గుండియన్
విప్పి, ఘుమం ఘుమల్ పతికిఁగానుకగా వలపించుఁ బున్నెమం
దెప్పటికప్పుడీవు గ్రహియింతువు కొంతకుఁ గొంత భాగమున్॥

9. అటులనమ్మఁగా మిగిలిన యలరులెల్ల
నిత్యమును నీదునిల్లాలి నీలికురులఁ
దురుముచున్నప్పుడామె కందోయి యందుఁ
గలుగుఁగాంతికి వెలకట్టఁగలదె జన్మ ॥

10. ఇంటి యిల్లాలినట్టు చొక్కింపఁజేయుఁ
గుసుమములనమ్ము నీవృత్తి గొప్పదయ్య
నిచ్చలుం జడ పూలతో నిండిపోయి
వరలు నీ భార్య యెంత సౌభాగ్యవతియొ ॥

11. అనుచునూరక పల్కుచున్నట్టి నన్ను
వింతగాఁజూచి, యొక నవ్వు విసిరినాఁడు
విసిరి,యంతలోఁ బెదవిని విరిచినాఁడు
విరిచి, యొక మారు తన గుండె విప్పినాఁడు ॥

12. పండితులు మీరు బాగుగాఁబలుకఁగలరు
కవులు గావుననూహలు కలుపఁగలరు
కడుపు నిండిన వారౌటఁగలలు గనుచుఁ
గతలు పలుకుచుఁగాలమ్ము గడుపఁగలరు ॥

13. చదువు సంజలెఱుఁగఁజాలని బ్రదుకులు
ఠెక్కలాడినపుడె డొక్కనిండు
మీకుఁబలెనె మేము మేలైన పలుకులు
పలుకఁగలమె ! మెచ్చఁగలరె మీరు ॥

14. ఐనను నొక్కమాట పలుకాడక తప్పదటంచుఁదోచున
య్యా! నను గట్టుకొన్నది యొయారముగానరవిచ్చు మల్లియల్
వేనలి యందునం దురుము వింతలు నాకగుపట్టవెన్నడున్
గాని, యెడందలో విరుల కమ్మని వాసనలుప్పతిల్లెడిన్ ॥

15. ఎన్నఁడేనియునర దోసెడేనిఁబూవు
లింటికై తీసికొని పోదునేనినప్పు
డింటిదాని కన్నులు వికసింపవయ్య !
యేదియో వింతనీరు స్రవించుఁగాని ॥

16. మఱి యొక్క వీథికేఁగిన
నర దోసెడు పూలు గూడనమ్మిన యెడలన్
మఱి కొంత గంజి బిడ్డల
పఱగడుపును బాపునంచుఁ బలుకందొడఁగున్

17. మాటలంబడి సంగతిన్ మఱచినాను
మొగ్గలన్నియుఁ బూవులై పోయెనేని
సగము వెలకూడ రాదు నే సాగవలయు
నయ్య ! సెలవిచ్చుఁడంచుఁ దానరిగినాఁడు

18. అతఁడా ! గాక కవిని నేనా ! యటంచు
మిగుల యాశ్చర్యమున నేను మిగిలిపోతి
మిగిలి పోయిన యప్పుడే మేలుకొంటి
మేలుకొన్నది నా కవితా లతాంగి ॥



# 16. సంక్రాంతి

వైరాగ్య వాసనల్ పండించె భరతాంబ
దానికి మా హరిదాసు సాక్షి
సంగీతమున జంతు జాలమ్ము నే తన్పె
ఇద్దానికో గంగిరెద్దు సాక్షి
సరస సంభాషణా సాహితీ చాతురి
కల్లరి మఱదలు పిల్ల సాక్షి
ప్రతి పదార్థమునందు భగవంతునిం జూపె
ముఖ్యమ్ముగా గొబ్బిముద్ద సాక్షి
కాయ కష్టమ్ములో లక్ష్మి గలదటంచు
పలుకుచుంటకుఁ బచ్చని పైరు సాక్షి
పల్లె సొగసులకై రంగవల్లి సాక్షి
శ్రమయె సౌందర్యమనఁగ సంక్రాంతి సాక్షి



# అవ్యక్త కవిత్వం



1. పద్యమ్మునెవఁడురా ; పాతిపెట్టెదనంచు
    నున్మాదియై ప్రేలుచున్నవాఁడు?
పద్యమ్మునెవఁడురా ; ప్రాతవడ్డదియంచు,
    వెఱ్ఱివాఁడై ; విఱ్ఱవీగువాఁడు ?
పద్యమ్ము ఫలమురా ! పాతిపెట్టినఁ బెద్ద
    వృక్షమై పండ్ల వేవేలనొసఁగు;
పద్యమ్మునెప్పుడో పాతిపెట్టితిమేము
    లోకుల హృదయాల లోతులందు;

ఇప్పుడద్దానిఁ బెకలింపనెవరి తరము ?
వెలికి తీసి, పాతుట యెంత వెఱ్ఱితనము !
నిన్నిటికి మున్ను మొన్ననే కన్ను దెఱచు
బాల్యచాపల్యమునకెంత వదఱు తనము !

డా॥ కడిమిళ్ళ

భవాని, పాలకొల్లు ఫోన్ 23262